**బొల్లిన వీర వెంకట ప్రసాద్** పూర్వులు తణుకు సమీపంలోని ముక్కామల, సూర్యారావుపాలెం గ్రామాలలో రైతు కుటుంబాలకు చెందిన శ్రీ బొల్లిన వీరన్నగారు, శ్రీ భోగవల్లి సుబ్బారావుగారు. తల్లిదండ్రులు శ్రీమతి విజయలక్ష్మి, శ్రీ అచ్యుతం. వీరికి ప్రసాద్ తరువాత ఇద్దరు పిల్లలు నాగేంద్రకుమార్, శ్రీ భవాని. తండ్రిగారు కొంతకాలం చాగల్లులో ఉద్యోగం చేసి, 78లో తణుకులో వ్యాపారం ప్రారంభించి, స్థిరపడ్డారు.

21 నవంబరు 66న పుట్టిన ప్రసాద్ బాల్యం మాతామహులు, నలుగురు మేనమామల ఉమ్మడి కుటుంబంలో గడిచింది. తరువాత తల్లిదండ్రుల వద్ద, ఏడవతరగతి వరకూ చాగల్లులోనూ, బికాం రెండవ సం. వరకూ తణుకులోనూ, చివరి సం. కాకినాడలోనూ, సి.ఎ. చేసే ప్రయత్నంలో ఒక సం. మద్రాసులోనూ చదువూ, జీవితమూ గడిచాయి. 91లో మాలతితో వివాహమైంది. గాయత్రి, భార్గవి వీరి సంతానం. చదువు తరువాత చాలాకాలం తండ్రిగారికి వ్యాపారంలో సహాయంగా ఉండి, 2003 నుండి మూడేళ్ళు తణుకులో స్కూలు నడిపి, నష్టాలతో విరమించుకొని, మళ్ళీ తండ్రిగారి వ్యాపారంతో కాలం గడుపుతున్నారు.

సున్నితమైన స్వభావం, లోతైన అన్వేషణ, తగినంత ఆర్ద్రత, నిజాయితీ, చేసేపని ప్రాణం పెట్టి చేయటం, నచ్చనివాటిని తీవ్రంగా వ్యతిరేకించటం, లేదంటే వాటికి వీలైనంత దూరంగా ఉండటం, ఇతరులలో మరిన్ని మానవీయవిలువలు ఆశించి తరచూ నిస్పృహ చెందటం తన వ్యక్తిత్వంలో ముఖ్యమైన లక్షణాలుగా గమనించిన ప్రసాద్, సరైన కారణం తెలియని లోలోపలి వెలితి ఒకటి తన జీవిత గమనాన్ని శాసిస్తుందని భావిస్తారు. దానినే డిమాండ్ ఫర్ ఎక్సలెన్స్ అని కూడా అనుకోవచ్చునని, అది బహుశా అందరిలోనూ ఉంటుందని, దానిని గుర్తించే సున్నితత్వం, వ్యవధి, అంతర్ముఖీనత ఉండాలని అంటారు.

సుమారు పదేళ్ళ వయసునుండీ పుస్తకాలంటే అమిత ఇష్టమైన ప్రసాద్, తెలుగులో దొరికిన సాహిత్యం, ముఖ్యంగా కథా, వ్యాస సాహిత్యం ఎక్కువగా చదివారు. శరత్, శ్రీశ్రీ, చలం, టాగోర్, టాల్‌స్టాయ్, సంజీవదేవ్ తన ఆలోచనలని, ఊహా ప్రపంచాన్ని, ఉద్వేగాలని ప్రభావితం చేసినవారిలో కొందరు. డిగ్రీ చివరి సం. 86లో, చలం రాసిన భగవాన్ స్మృతులు, వెలుగురవ్వలు చదవటం, సాహిత్యం వలన తనకు జరిగిన ముఖ్యమైన మేలుగా భావిస్తారు. భగవాన్ శ్రీ రమణమహర్షి అతి సరళజీవనం, సూటిగా, స్పష్టంగా ఉండే ఆయన బోధనలూ తనకు జీవితంలోని అనేక విషయాల పట్ల స్పష్టతనీ, సరైన స్పందనలనీ కలిగించాయని తలుస్తారు. పుస్తకాల తరువాత

ప్రకృతి, స్నేహితులూ, ప్రయాణాలూ, ఫొటోగ్రఫి, సంగీతం, సినిమాలూ తన సృజనాత్మక సహచరులు.

స్కూలు చదువులో చిత్రకళతో మొదలైన సృజనాత్మక వ్యాసంగం, కాలేజీ చదువునుండీ కవిత్వంవైపుగా తిరిగింది. 89లో ఆరాధన సంపుటి ప్రచురించే నాటికి కవిత్వం, కథలు, సాహిత్య, తత్వ చింతనలతో కూడిన ఏడెనిమిది నోట్‌బుక్స్ రాసుకొన్నారు. రసాత్మకత, గాఢమైన అనుభూతి, సంక్షిప్తత కవిత్వరచనకి ముఖ్యమని భావించే ప్రసాద్, తన స్వభావానికి హైకూ ప్రక్రియ దగ్గరగా ఉండటంతో 95, 97, 99లలో వరుసగా దృశ్యాదృశ్యం, హైకూ, పూలురాలాయి హైకూ సంపుటాలు ప్రచురించారు. ప్రసాద్ హైకూలు, హైకూపై వ్యాసాలూ తెలుగు హైకూ సాహిత్యంలో ఉత్తమమైనవిగా ప్రసిద్ధిపొందాయి. తరువాత వచనకవిత్వంలో తన శైలిని కనుగొనే ప్రయత్నంలో భాగంగా రాసిన కవితలతో 2006లో నేనే ఈ క్షణం ప్రచురించారు.

అనేక దేశకాలాలకు చెందిన జ్ఞానుల మాటలని వర్తమాన జీవితంతో సమన్వయించుకొంటూ, అధ్యయనం చేయటం మానవ వికాసానికి దోహదం చేస్తుందని భావించే ప్రసాద్, వ్యక్తీ - సమాజమూ, బుద్ధీ - హృదయమూ, జీవితమూ - అంతిమ సత్యమూ పరస్పర వ్యతిరేకాలు కావని, స్త్రీ - పురుష శక్తులవలే పరస్పర పూరకాలనీ, జాతుల, మతాల, ప్రాంతాల సంస్కృతుల సారాన్ని గ్రహిస్తూ, ఒక మహామానవ సంస్కృతి విస్తరించాలని, ఎవరి జీవితమని కాకుండా, అందరం మొత్తం జీవితం పట్ల బాధ్యత కలిగి స్పందించాలని, ఆలోచించాలని, వికసించాలని కలగంటారు.

సాహిత్యం పట్ల ప్రజలలో క్షీణిస్తున్న ఆసక్తీ, దానికి దారితీసిన, ఉదాత్తత, నిజాయితీ లోపిస్తున్న సాహిత్యకారుల ఇరుకిరుకు వాదప్రతివాదాలూ; సాంకేతిక పరిణామాలూ, అనేక ఇతర కారణాల వల్ల పొడిబారుతున్న మానవ సంబంధాలూ; వ్యక్తిగత జీవితంలోని ఒడిదుడుకులూ - వీటన్నిటితో సృజనకి దూరంగా చాలా సంవత్సరాలు గడిచాక - జీవితం పట్ల మరింత స్పష్టతా, ఇష్టతా ఏర్పడుతున్న దశలో - క్షీణిస్తున్న మానవవిలువల పట్ల వ్యథచెందే అక్కడక్కడి మిత్రులను చూసి, ముఖ్యంగా కొందరికైనా తన మాటలు ఓదార్పునీ, స్పష్టతనీ, బలాన్నీ ఇవ్వటం గమనించి, తనకు అర్థమైన జీవితాన్ని ఇతరులతో పంచుకోవటం కోసం 2010-11లలో సుమారు నాలుగు నెలల కాలంలో రాసిన కవిత్వంతో ఇప్పుడు ఆకాశం సంకలనం తీసుకువచ్చారు.

***AAKAASAM***
*Telugu Poetry*
*by* ***B.V.V. Prasad***




First Edition : July 2011

Cover Design : Ramana GV



Poet's Address : B.V.V.Prasad
# 23-12-21, Sajjapuram
TANUKU W.G.Dt 534 211
Mobile : 90320 75415
Email : prasadbvv1@gmail.com
Websites : picasaweb.google.com/prasadbvv1
bvvprasad.blogspot.com



Printed at : Vipla Computer Services
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 44
Ph : 040-27677078, 27676910

Price : Rs. 70

# క్రమసంఖ్య

# పుట్టగానే పిల్లలు

పుట్టగానే పిల్లలు నవ్వరెందుకని
వాళ్ళు ఏ వెలుతురులో ఈదివచ్చారు
ఏ ఆనందాలు దాటి వచ్చారు
ఏ హద్దుల్లేని దేశాలు ఎగిరివచ్చారు

పుట్టగానే పిల్లలు నవ్వలేరెందుకని
వాళ్ళు ఏ పవిత్రసీమలు విడిచివచ్చారు
ఏ దయాపూర్ణహస్తాలు విడిచిపెట్టారు
ఏ కపటంలేని కాలాలు పోగొట్టుకొన్నారు

వాళ్ళంతవరకూ
ఏ జరామరణాల అంచుల్ని దాటి బ్రతికారు
ఏ భయరహిత ఏకాంతంలో సంచరించారు
ఒక్క మాటైనా, ఒక్క చూపైనా, ఒక్క మనిషైనా అక్కర్లేని
ఏ మహాశాంతి లోకాన్నుండి ఇక్కడికి జారిపోయారు

పుట్టగానే పిల్లలు ఎప్పుడూ ఏడుస్తారెందుకని
దు:ఖమయ ప్రపంచాన్ని వ్యాఖ్యానిస్తారెందుకని

25 ఫిబ్రవరి 2011

# ఆకాశం

ఇపుడు ఆకాశం తరచూ కవిత్వమవుతోంది
సారం కనరాని ఆకాశం రసార్ణవమెలా అయిందని అతనాలోచించాడు
ఆకాశం బహుశా తన ఆకాంక్షల ప్రతీకలా వుంది, తన లక్ష్యంలా వుంది

అంతస్సారానికి చెందిన అనేకభావాలకి ఆకాశం ప్రతీక
ఉద్వేగాలతో కలుషితంకాని మనస్సుకీ
అనుభవాలతో కలతచెందని మెలకువకీ
ఆలోచనల ఆటంకంలేని స్ఫురణకీ
కోరికల వెలితిలేని ఆనందానికీ
ఏ బంధం ఆపలేని స్వేచ్ఛకీ
సరిహద్దులు తెలీని విశాలత్వానికీ ప్రతీక ఆకాశం

సృష్టికి తానే కారణమై ఏమీ ఎరగనట్లుండే స్వచ్ఛతకీ
అన్నిటినీ తనలో పొదువుకొని, అన్నిటిలో ఒదిగి
ఏదీ తనది కాదన్నట్లుండే నిర్మలప్రేమకీ
ఉండీలేనట్లుండే ఉదాత్త స్వభావానికీ ఆకాశం ప్రతీక

మనం ఆకాశం పిల్లలమనీ, చిన్నచిన్న ఆకాశాలమనీ
మనని ఎప్పుడూ వదలని అమ్మలాంటి ఆకాశాన్ని
మనమే తప్పించుకొని, తప్పిపోయామనుకొని
సదా వెదుకుతూ తిరుగుతున్నామని అతను గమనించాడు

సదా మనని కలగంటుంది అమ్మ ఆకాశం
అమ్మ ముఖంలోకి చూడటంకన్నా ఆనందం ఏముందని
తన తల్లిని తనలో కనుగొనటంకన్నా అందమైన పని ఏమిటని

అతను తనలోకి తిరిగి, తన ఆకాశం కనుగొని
తన ఆకాశంలో బహుజన్మల దుఃఖంనుండి విశ్రాంతిపొంది
ఆకాశంనుండి అపుడే పుట్టిన ఆకాశంలా మళ్ళీ మనని పలకరిస్తాడు
మనలోపలి నిర్మలాకాశానికి అద్దమై మనముందు నిలుస్తాడు

*30 మార్చి 2011*

# ఎదురుచూస్తారు

ఇల్లంతా సందడిగా ఉంది
అతిథులతో నిండిపోయి కళకళలాడుతోంది
పసివాడికి మాత్రం తోడు ఎవరూ లేరు
తనతో తానే ఆడుకొంటున్నాడు

తనని అందరూ ప్రేమిస్తారు
చూడగానే ఓ క్షణం వికసిస్తారు
అయినా తనతో ఆడుకొనే తీరిక ఎవరికీ లేదు

తలుపులు మూసిన మందిరంలో దేవుడూ
పెద్దవాళ్ళకి అడ్డం రాకుండా పసివాడూ
తమ సమయం వచ్చేవరకూ ఎదురుచూస్తారు
పెద్దల సంరంభాలని అర్ధంకానట్లు చూస్తారు

ఇంకా మాటలు నేర్వని దేవుడూ
ఇంకా మాటలు చాలని పసివాడూ
ఒకరిలో ఒకరు తమ ఒంటరితనం దర్శిస్తారు

పనులు చేసీచేసీ అలసిపోయి
వీటికి అంతమేమిటి, అర్ధమేమిటని ఆలోచించి
విశ్రాంతి వైపుగా పెద్దవాళ్ళు తిరిగినపుడు
దేవుడూ, పసివాడూ నిజమైన జీవితం ప్రదర్శిస్తారు

అంతవరకూ వారు పెద్దమనసుతో ఎదురుచూస్తారు

*29 మార్చి 2011*

# ఇంటి బెంగ

ఏ అలజడీ లేనపుడు
అలలన్నీ కొలనులో దాగివుండి
నీటిలో నీరు పొందికగా సర్దుకొంది

ఏ వెలుతురూ లేనపుడు
నీడలన్నీ రాత్రిలో దాగివుండి
చీకటిలో చీకటి హాయిగా విశ్రమించింది

ఏ కదలికా లేనపుడు
శబ్దాలన్నీ నిశ్శబ్దంలో దాగివుండి
ప్రశాంతత ప్రశాంతంగా విస్తరిస్తోంది

అయితే
ఏ పుట్టుకా లేనపుడు
అందరం ఎక్కడ దాగివున్నాం
సృష్టి ఏమై వుంటుంది

కొలనులో రాయి వేసాక
నీటివలయాలు బయటపడినట్లు
ఈ ప్రశ్నలు వేసుకొన్నాక
ఏవో దిగులు వలయాలు బయటపడుతున్నాయి

బయలుదేరిన చోటికి, త్వరగా తిరిగివెళ్ళాలనే బెంగ ఏదో
ఈ శీతాకాలపు పొగమంచుతో పాటు
గాలినిండా, ఆకాశంనిండా పరివ్యాప్తమౌతోంది

*29 డిసెంబరు 2010*

# చంద్రలోకవాసి

చలికాలపు రాత్రి నిర్మలాకాశంలో చందమామ ప్రకాశిస్తోంది

ఏవో శబ్దాలు ఇంటి ముందునుండి వెళ్ళిపోయాయి
పొగమంచు వెన్నెలలో మంచుముద్దలా కరుగుతోంది చందమామ

ఆకాశంలో పక్షి ఒకటి చప్పుడు లేకుండా వెళ్ళిపోయింది
సాలెగూడు వెన్నెలలో నెమ్మదిగా కదులుతోంది చందమామ

ఏదో ఒక ఆలోచన నెమ్మదిగా పలుకరించి వెళ్ళిపోయింది
నల్లని మెరిసే రాత్రిలో ఒంటరిగా తిరుగుతోంది చందమామ

ప్రతి విరామం తరువాత
ఇతను చందమామలోకి క్రొత్తగా ప్రవేశిస్తున్నట్లు తెలుసుకొన్నాడు

బహుశా కోటి చందమామల కాంతి ఏదో
ఇతను ఇక్కడికి వచ్చి, వెళ్ళటానికి ముందూ, వెనుకా ఉండి ఉంటుంది
కాంతిలోకి వెళ్ళే సరదా అయిన ఆట కోసమే
కాంతిలో నుండి ఇక్కడికి వచ్చి ఉంటాడు

లేకపోతే ఇతనికి
మానవ ప్రపంచంకన్నా చందమామ ఎందుకు బాగా అర్ధమవుతుంది

*22 డిసెంబరు 2010*

# కొలను

జీవితం తేటనీటి కొలనులాంటిది
నీరుందో లేదో అన్నంత స్వచ్ఛమైన నీటిలాంటిది
ప్రపంచమనే ప్రతిబింబాన్ని
తనలోపల తాకకుండా పొదువుకొన్న కొలనులాంటిది జీవితం

కలతపడే సందర్భాలూ, మాటలూ
మట్టిపెళ్ళల్లా కొలనులోనికి జారినపుడు
అలల తలుపులు తెరిచి జీవితం వాటిని స్వాగతిస్తుంది

అవి తనలోనికి జారిపోతూ కరిగిపోతాయని కొలనుకి తెలుసు
అలలన్నీ ఒకటినొకటి ఓదార్చుకొని తేరుకొన్న నీటిలో
మరలా ప్రతిబింబం తేలుతున్నపుడు
కొలనులాంటి జీవితం తనను తాను ధ్యానించటంలో మునుగుతుంది

26 ఫిబ్రవరి 2011

# ముక్తికాంక్ష

బాగా చిన్నపుడు, ఆలోచించటం నేర్చుకొంటున్నపుడు
ముక్తికోసం మునులు తపస్సు చేస్తారని చదివి

జీవితం ఇంత అందమైంది కదా, ఆనందనిధి కదా
జన్మ ఒక శాపమైనట్టు, పాపమైనట్టు వాళ్ళెందుకు స్వేచ్ఛకోసం తపించారని
జనం మధ్య వెచ్చగా బ్రతకటంమాని అరణ్యాలకి వలసవెళ్ళారని
అమాయకంగా, వాళ్ళంటే దయగా తలుచుకొనేవాడిని

నిద్రపోతున్నపుడు ఊరిలో సడిలేకుండా ప్రవేశించిన వరదలా
కబుర్లలో మునిగి గమనించనపుడు పగటిలోకి చేరుకున్న రాత్రిలా
ఒక్కొక్కరోజూ గడిచి, కాలం నా దేహాన్నీ, మనస్సునీ, సందర్భాలనీ
మాయాజాలం చేసినట్టు మార్చుకొంటూ పోయాక

ఒకనాడు అకస్మాత్తుగా బాల్యం వెళ్ళిపోవటం తెలుసుకొని
నలుపు ప్రక్కన నిలబెట్టిన తెలుపులా
ఇవాళ్టి నా ప్రక్కన, బాల్యాన్ని నిలబెట్టి చూసుకొన్నపుడు

జీవితం ఆకాశంలా సుకుమారం కాదని, విశాలం, నిత్యనిర్మలం కాదని
నా ఆకాశం నాకు చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయిందని
నేను బంధించబడ్డానని, నా ప్రతి కదలికా, నవ్వూ, ఏడుపూ బంధించబడ్డాయని
నేను ఉండటమూ, వెళ్ళటమూ కూడా నా చేతుల్లో లేవని తెలిసింది

అప్పుడు బాల్యంపై బెంగ పెట్టుకొని
వెళ్ళిపోయిన పెద్దల వస్తువుల్ని వారికోసం తాకినట్టు
చిననాటి ఆలోచనలని తడుముకొని చూసినపుడు
మునుల ముక్తికాంక్ష జ్ఞాపకం వచ్చింది

మునులెందుకు స్వేచ్ఛకోసం తపస్సు చేస్తారో అర్థమైంది
సాటి మనుషులకన్నా , చివరికి అన్నంకన్నా, గాలికన్నా
స్వేచ్ఛ ఎంత ప్రియమైనదో, అవసరమైనదో తెలిసివచ్చింది

మనిషి చేయవలసిన పనికి
వ్యతిరేకంగా, ఎంత వేగంగా వెళుతున్నాడో అర్థమైంది
నా పైనా, వెచ్చని మానవుల గుంపుల పైనా దయ కలిగింది
అప్పుడు నా ప్రయాణం మొదలైంది

3 మార్చి 2011

# అంతరాత్మవంటివాడు

తిట్టాను కదా ఇక రాడేమో అనుకొంటే ఉషస్సులా నవ్వుతూ వస్తాడు
మెచ్చుకొన్నాను కదా తానే వస్తాడనుకొంటే
దీపాలారిన చీకట్లో మాయమైనట్లు మళ్ళీ కనిపించడు

ఏమిటలా చేస్తావంటే, తిట్టారా, మెచ్చారా చూడను.
మాటల్లో ఆర్ద్రత ఉందా, లేదా చూస్తానంటాడు
నీకుపయోగం మాట్లాడంటే మాటలు రానట్లుంటాడు
ఎవరైనా దు:ఖంలో ఉంటే, వెళ్ళి మరీ ఎన్నో కబుర్లతో ఓదార్చుతాడు

మన తప్పులకి కోపం వస్తే తాటాకుమంటలా భగ్గుమంటాడు
అంతలోనే చల్లారి నా నీలో సౌందర్యం మాత్రమే ఉండాలంటాడు
మంచి ఎవరిలో కనిపించినా మహా సంబరపడతాడు
మనం మంచివేపు నడిస్తే ఆనందాశ్రువులు రాల్చి దీవిస్తాడు

బలం, ధనం, పదవీ, తెలివీ, పేరూ
మనిషి స్నేహితులా, యజమానులా అని అడుగుతుంటాడు
అవి ఎక్కువైనచోట ఊపిరాడదేమిటంటాడు

దయ ఉంటే చాలంటాడు
దయ కన్నా తెలివేదీ, బలమేదీ ఆలోచించమంటాడు
దయ కన్నా సుఖమేదీ, సౌందర్యమేదీ ప్రశాంతంగా చూడమంటాడు
దయగలవారెవరైనా, పరిచయమే లేకపోయినా తనవారంటాడు

దయ ఉంటే ఓడిపోతామంటే, దయ లేకపోవటమే ఓడిపోవడమంటాడు
ఎక్కడ పోటీ మొదలైనా, పోటీ గెలుస్తుంది, మనిషి ఓడిపోతాడంటాడు

ఇతను ఏ లెక్కలకీ అందడు. లెక్కలు మానేస్తే అర్ధమౌతానంటాడు
ఏమిటో ఇతను – అచ్చం మన అంతరాత్మలా మాట్లాడతాడు
ఏమిటో ఇతను – మనం పోగొట్టుకొన్న జీవితంలా వుంటాడు

*24 జనవరి 2011*

# హృదయం ప్రవేశించినపుడు

ఎప్పుడూ విసుక్కొనే కొడుకు తల్లి పాదాలు తాకి దీవించమన్నపుడు
ఆమె కళ్ళలో ఎన్నడూ చూడని కన్నీరెందుకొస్తుంది

గాయపరిచాను, క్షమించమన్నపుడు
అప్పటివరకూ వెలవెలబోతున్న భార్య కన్నులవెంట ఆపలేని ధారలెందుకొస్తాయి

చాలా ఖర్చవుతుందేమో, వద్దులే నాన్నా అని పిల్లలన్నపుడు
వారి లేత దయాపూర్ణ హృదయాలు తలచి అతని కన్నులెందుకు చెమ్మగిల్లుతాయి

ఎన్నడూ తగినంత మాటలాడని కన్నతండ్రి
అర్ధరాత్రి దూరాలు దాటి వచ్చిన కొడుకు కోసం నిద్రమానుకొని ఎదురుచూస్తే
వారి మధ్య చల్లని గాలితెరలా ఆర్ద్రత ప్రవహిస్తుందెందుకని

అణగారిన మంచినెవరైనా గుర్తించిన ప్రతిసారీ
లేదనుకొన్న మంచితనం ఎదురైన ప్రతిసారీ
ఎవరినెవరైనా మంచితనంతో గెలుస్తూ గెలిపించిన ప్రతిసారీ
మన కళ్ళెందుకు చెమరుస్తాయి. మన కంఠాలెందుకు రుద్ధమౌతాయి

మనుషులిద్దరి మధ్య హృదయం ప్రవేశించిన ప్రతిసారీ
తెలివికాని తెలివీ, బలంకాని బలమూ కన్నీరుగా మారి పారలిపోతాయెందుకని
సారవంతమైన మౌనం పొదువుకొంటుందెందుకని, జీవితం నెమ్మదిస్తుందెందుకని

బహుశా, అపుడు మన లోపలికి మనం చేరుకొంటామేమో
మాయాలోకాన్ని కడుగుకొని మనని మనం నిజంగా చూసుకొంటామేమో
దేవునివంటి మనం దారితప్పిన పురాస్మృతిలోకి మేలుకొంటామేమో

*1 ఫిబ్రవరి 2011*

# గాయపడినప్పుడు

అకస్మాత్తుగా గాయపడతాము
మన ప్రాణంనింపి విడిచిన మాటని ఎవరో తేలిక నవ్వుతో చెరిపేస్తారు
పగటికలలో గాలిపటంలా తేలుతున్నపుడు ఎవరిదో అరుపు దారమై లాగేస్తుంది
కోనేటిలో నిదానంగా ఈదే చందమామకి రాయి తగిలి వేయిముక్కలవుతుంది
మన ముఖాన్ని కలగంటున్న అద్దం పగిలి మనల్ని అన్నివేపులా విసిరేస్తుంది

అప్పుడు ఎవరో మనల్ని చెరిపేసి మనస్థానంలో గాయాన్ని నిలబెడతారు
అప్పటినుండి ఒక గాయం మన బదులు మాట్లాడుతుంది, తింటుంది, నిద్రపోతుంది
మనం నవ్వాల్సివస్తే మన బదులు ఒక గాయం నవ్వుతుంది

గాయం గదిలో చేరి, చిరునవ్వు కాంతినైనా, ఆర్ద్రవాక్యంవంటి శీతలపవనాన్నైనా
తనలోనికి రానీయకుండా తలుపులు మూసేస్తుంది
స్వాతిచినుకులాంటి గాయాన్ని స్వీకరించి ఆల్చిప్పలు మూసుకొంటాయి
జీవితం గదిచుట్టూ దయగా, ఆత్రుతగా పచార్లు చేస్తూ ఉంటుంది

గాయం తపస్సు చేస్తున్నంత శ్రద్ధగా తనతో తాను యుద్ధం చేస్తుంది
పరీక్ష రాస్తున్నంత ఏకాగ్రతగా తనని తాను వ్యక్తం చేసుకొంటుంది
కాంతినిండిన ఒక ఉదయం ఆల్చిప్పలూ, తలుపులూ తెరుచుకొంటాయి
చినుకుతో పోరాడిన జీవి ఏదో చందమామలా బయటకు వచ్చి
జీవితాన్ని కౌగలించుకొంటుంది

*15 ఫిబ్రవరి 2011*

# మంచిమనిషి

మంచితనం మంచుపర్వతంలాంటిది
మంచిమనిషితో ఉన్నంతసేపు జీవితాగ్ని అణిగి చల్లబడినట్లుంటుంది
అతని తెల్లనికాంతి ప్రసరించి మనం శుభ్రమైనట్లుంటుంది
అతను మనలో ప్రతిఫలించి, మనమే తానైనట్లుంటుంది

అతను వెళ్ళిపోయాక మనల్ని పోగొట్టుకొన్న దిగులు ఏదో
ఉక్కపోతలో ముసురుకొన్న వానలా చీకాకు పెడుతుంది
వేసవి పగలులాంటి దయారహితమైన ప్రపంచంలో
తాను కరుగుతూనే తరగని మంచులా ఎలా ఉన్నాడనే ప్రశ్న
స్నేహితుడిలా పలకరించి వెళ్ళిపోతుంది

. . .

గమ్యాన్ని గుర్తుచేసే రైలుటికెట్టులా
చివరిరోజును చేతిలో పెట్టుకొని అందరం వస్తాం
ఈ మాయామజిలీ ఎన్ని చూపిస్తే అన్నీ కావాలంటాం

ఏమీ వద్దు, మంచితనం చాలని ఎవరంటారు
మంచిలా మినహా మరోలా మిగలటం కుదరని,
కాంతిలా మినహా మరోలా మిగలటం కుదరని
నిత్య దహనక్రియని ఎవరు ఎన్నుకొంటారు

. . .

ఏదో చేయటానికే ఇక్కడికి వచ్చామని
ఒంటరిగా ఉన్నపుడు మనలో ఎవరో చెబుతున్నట్లుంటుంది
శబ్దారణ్యాల ప్రపంచంలో దారితప్పని అతను శ్రద్ధగా ఆ స్వరం వింటాడు

ఎగసిపడే అలలతో సాటివారు లేస్తూ, పడుతూ వున్నా
తాబేలులా తనలోకి ముడుచుకొని వినిపించే పిలుపుని అనుసరిస్తాడు
మనని మనం తప్పించుకు తిరిగేందుకు పదిమందిలో దాగివుండే మన మధ్యనుండి
ఒంటరిగా, దయగా తలవంచుకొని అతను దుఃఖపు శిలువను మోస్తూ వెళతాడు

. . .

అందరినీ ఒకే ఆకాశం, ఒకే భూమీ తయారుచేసుకొన్నాయి
ఫలం తనలో తాను పక్వమౌతూ పరిమళాన్ని వెదజల్లినట్లు
సృష్టి తనలో తాను పక్వమౌతూ మానవుల్ని సృష్టించుకొంది
మానవులలో పరిమళాలవంటి ఊహల్ని సృష్టించుకొంది

పక్వం కావటమంటే పదేపదే తనని కోల్పోవటమేనని తెలుసుకొన్న అతను
ఊహనైనా తనకోసం మిగుల్చుకోని నిష్కపట హృదయసీమలో
సృష్టి తనలోపలి ఫలం కావటం దర్శిస్తాడు

. . .

మనను విడిచి వెళ్ళాడని, నిందించిన మనం
ఒక నిర్మలమైన ఉదయం అర్థవంతమైన ఒంటరితనంలో నిలబడినప్పుడు
మనను విడిచి వెళ్ళినవాడు
మనలోపల మనకన్నా దగ్గరగా వుండడం గమనించి ఆశ్చర్యపోతాము

*16 జనవరి 2011*

# ఎవరో మేలుకొన్నట్లు

నిన్ను గాయపరిచిన మనిషివైపు దయగా చూసినపుడు
నీకు ఇష్టమైన వస్తువొకటి ఎవరికైనా మనసారా ఇచ్చినపుడు
గెలిచి కూడా ప్రపంచంముందు వినమ్రుడివై మోకరిల్లినపుడు

ఏదో జరుగుతుంది, లోపలెవరో మేలుకొన్నట్లుంటుంది
ఉద్వేగాలన్నీ బడిపిల్లల్లా బుద్ధిగా కూర్చున్నట్లుంటుంది
తలపై నుండి తెలియని భారం దిగిపోయినట్లుంటుంది
తీరం విడిచిన పడవ తానే ప్రవాహమైనట్లుంటుంది

ఎవరూ పట్టించుకోని నిన్ను చూసుకొని హాయిగా నవ్వుకొన్నపుడు
ఇతరుల నిష్కపట దుఃఖంలో, నవ్వులో నీకునువ్వు కనిపించినపుడు
నానావర్ణసమ్మిళిత ప్రపంచం విడిచి నీలోకి నువ్వు చూసినపుడు
క్షణమైనా జీవన భయాన్ని మరిచినపుడు, పూర్తిగా నిన్ను మరిచినపుడు

లోలోపల ఎవరో ధ్యానం చేస్తున్నట్లుంటుంది
అంతంలేని మౌనం ఏదో నిన్ను అన్వేషిస్తున్నట్లుంటుంది
చందమామ ఆకాశంలో మెల్లగా ఎగురుతున్నట్లుంటుంది
మధురస్వప్నాల చివర బంగారుఎండ కనురెప్పల్ని తాకినట్లుంటుంది

నువు ఊయలలో ఉన్నట్లూ
ఆకాశం అమ్మముఖంలా నీమీదికి వంగినట్లూ ఉంటుంది
దైవం నీముందు నిలిచి నీతో కరచాలనం చేసినట్లుంటుంది

అప్పుడు బాల్యంలోకి మళ్ళీ ప్రవేశించినట్లుంటుంది
చూసిన ప్రతివస్తువునీ మళ్ళీ మృదువుగా తాకాలనిపిస్తుంది
చూసిన ప్రతిమనిషినీ హృదయంలోకి తీసుకోవాలనిపిస్తుంది
సృష్టి అంతటినీ చూసి ఆశ్చర్యపోవాలనిపిస్తుంది

అప్పుడు జీవితంపై మరిచిపోయిన ప్రేమ మళ్ళీ గుర్తుకొస్తుంది
క్షణం జీవితం చాలనిపిస్తుంది. కల్పాలు బ్రతికినా చాలదనిపిస్తుంది

*19 నవంబరు 2010*

# భయపడినప్పుడు

భయపడినప్పుడు మనిషి ముఖం అరణ్యమౌతుంది
అతని కళ్ళల్లో ఏవో మృగాలు విశ్రాంతి లేక తిరుగుతాయి

భయపడినప్పుడు గాఢమైన నిద్రలోంచి ఉలిక్కిపడి లేచినట్లుంటుంది
భయంనుండి బయటపడాలనే కోరిక ఏదో
చీకటిలో మెరిసే జంతునేత్రాలలా దిక్కుతోచక తిరుగుతుంది

భయపడినప్పుడు మనిషి అంతే
లోకంలోని చీకటి అంతా అతనిలో ఘనీభవిస్తుంది
తనలోపలి చీకటిచీకటిలో తానే ఎక్కడైనా దాక్కోవాలనిపిస్తుంది

భయం ఒక ఆదిమభావం, ఒక రక్షణవలయం, దయగల శక్తి
అది మనిషిని ఏకాంతదీవికి చేరుస్తుంది
అతనిలోని మహాశక్తులకి ద్వారం తెరుస్తుంది

చీకటిపుష్పంలాంటి భయం, మరణంలాంటి భయం
ప్రపంచాన్ని ఒకవైపునా, అతన్ని ఒకవైపునా నిలబెట్టి
సన్నని సరిహద్దురేఖ గీసి చూపిస్తుంది

శిఖరంనుండి నదిలో దూకినట్లు
పంజరంనుండి ఆకాశంలోకి ఎగిరినట్లు
నేలనుండి నేలలేనిచోట అడుగేసినట్లు
భయంలోని మనిషి ప్రపంచాన్ని విడిచి, తనతో తానే నిలిచి ఉండాలి

అప్పుడు, రాతిలోని కప్పకి రాయి చిట్లి ఆకాశం కనిపించినట్లు
ఊహలోని మనిషికి ఊహ చెదిరి ప్రపంచం ప్రత్యక్షమైనట్లు
భయంలోని మనిషికి భయమేఘం చెదిరి ఆకాశంలాంటి సాహసం కలుగుతుంది
అప్పుడు మనిషి ముఖం ప్రశాంతమైన చిరునవ్వుతో మెరుస్తుంది

*12 నవంబరు 2010*

# వెళ్ళిపోవాలనుందా

పరీక్ష తప్పటమో, ప్రేమలో విఫలమో
తీర్చలేని అప్పులో, బాగుపడని ఆరోగ్యమో
ఘోరంగా మోసపోవటమో, చేసిన మోసం బయటపడటమో

దయమాలిన లోకంమీద వల్లమాలిన కోపమో, భయమో
నదినీటికట్ట నానీనానీ తెగిపోయినట్టు
ఒక్కసారిగా ఆవహించిన నిస్పృహో, దు:ఖమో

అకస్మాత్తుగా అంతా ఇక సరిపెడదామనిపిస్తుంది
లోకాన్ని విదిలించుకొని వెళ్ళిపోవాలనిపిస్తుంది

వెళ్ళిపోయావనే కాసేపు అనుకొందాం
కలలన్నీ చెదిరిపోయినా నువ్వు వెళ్ళిపోవటాన్ని చివరిగా కలగందాం
నీ పార్థివదేహం ముందు నువ్వే కూర్చుని కాసేపు కరువుతీరా ఏడ్చిచూడు
ఏడ్చేవారొకరైనా ఉన్నారో లేదో నీ మరణానికి నువ్వైనా కన్నీటిని అర్పించు

నీలోకి దారిలేక నీదేహం చుట్టూ వెర్రిగా తిరిగే నీ ప్రాణాన్ని చూడు
నిన్ను కోల్పోయి చలిబారిన పడుతున్న వెచ్చని నీ కలల్ని చూడు

నీ పాదముద్రల అలికిడి లేక తల్లిధరణి బోసిపోవటం చూడు
నీ పసితనంలోని ముఖంలా బేలగా నీ దేహాన్ని చూస్తున్న ఆకాశాన్ని చూడు
నీ కళ్ళలోంచి జారలేక ఆగిపోయిన పావన దు:ఖాశ్రువుల్ని చూడు

రోదించు రోదించు మనసారా రోదించు
కన్నీరు మినహా మరేమీ అక్కర్లేనట్లు రోదించు
కన్నీరు మినహా మరెవరూ లేనట్లు రోదించు
మళ్ళీ నువ్వైనా నీకోసం ఏడుస్తావో లేదో
నీ అణువణువూ తట్టిలేపి వేయికంఠాల కంఠంతో రోదించు

నీ శోకంతో లోకంలో చీకటినంతా శపించు, శపించు
నిన్ను బ్రతికించుకోలేని తెలివిలేని మనుషుల్ని క్షమించు, క్షమించు

అయినా ఎందుకు చావాలి

గెలుపు జ్వరం తగిలిన లోకంలో పరాజితుడివై ఆరోగ్యంగా జీవించు
మర్యాదల ప్రాకారాల ఊపిరాడని మనుషుల్ని దయతో పరిహసించు
సమర్థుల్ని ఈతల్లో కొట్టుకుపోనిచ్చి జీవితంగట్టున ప్రశాంతంగా నిలబడిచూపించు
బ్రతికేందుకు వచ్చావు కనుక బలంగా ఒక బ్రతుకు బ్రతికి చూపించు

కనీసం ఈ గంట బ్రతుకు, కనీసం ఈ రోజు బ్రతుకు
మళ్ళీరాని లోకంలో, ఇక మనకేమీ కాని లోకంలో
మరణిస్తే మరి ఉంటుందో లేదో తెలీని లోకంలో
చావుధైర్యంతో ఎప్పటికీ బ్రతికి చూపించు, నిజమైన బ్రతుకు బ్రతికి చూపించు

*9 ఫిబ్రవరి 2011*

# కొన్ని సమయాలు

ఏ పనీ చేయరాని కొన్ని సమయాలుంటాయి
గర్భంలోని శిశువులా కుదురుగా ఉండాల్సిన సమయాలుంటాయి
గాజుసీసాలో కొత్తగాలిని బంధించినట్లు ఏమీ మాట్లాడరాని సమయాలుంటాయి

సంభాషణ సగంలో గదివెలుపలి సవ్వడి వినబోయినట్లు
ఊహల్లేని ప్రశాంతిలో ఆకాశం లోపలికి చూడబోయినట్లు
ఊరికే ఎదురుచూస్తూ ఉండాల్సిన సమయాలుంటాయి

ఎదురుచూడడం మినహా
తెలియని అతిథికోసం వాకిలిముందు నిలబడి ఉండడం మినహా
ఉద్వేగాలన్నీ పొదివి పట్టుకొని ఓర్చుకోవటమెలాగో నేర్చుకోవటం మినహా
ఏ పనీ చేయరాని కొన్ని సమయాలుంటాయి

కణకణమూ కలిసి కారుమేఘం తయారయేవరకూ
సారమంతా జతకూడి లేతమొక్క నిటారుగా నింగిముఖంలోకి చూసేవరకూ
గాయపడిన దేహాన్నో, హృదయాన్నో
కాలం మునివ్రేళ్ళతో నిమిరి జీవరసం నింపేవరకూ
పలుచని స్పందనలన్నీ కలిసి
చిరునవ్వో, కన్నీటిబిందువో తనంత తాను పుష్పించేవరకూ

పని చేయకపోవటమే సరైన పనిగా వుండే సందర్భాలుంటాయి
ఉత్సవమంత ఉత్సాహంతో ఊరికే వుండే విరామాలుంటాయి
మేలుకొన్నంత సహజంగా నిద్రపోవలసిన రాత్రులుంటాయి

ఇదికాదు, ఇదికాదంటూ
ఎప్పటి అనుభవాలు దాటి జీవితం లోతులు చూసే క్షణాలుంటాయి

అలవాటైన మాటలు విడిచి, అలవాటైన పనులు విడిచి, అలవాటుగా బ్రతకటం విడిచి
మరలా మొదటినుండి మేలుకోవలసిన సమయాలుంటాయి
కొన్ని సమయాలుంటాయి

*23 జనవరి 2011*

# చాలు

అడవిలో వికసించి రాలిన అనామక పుష్పంలా
ఎవరూ చూడనప్పుడు ఎగురుతూ వెళ్ళిపోయిన పేరుతెలియని పిట్టలా
అక్షరాలు గుర్తించేలోపు అదృశ్యమైన ఊహలా
గుడితలుపులు మూసాక లోపల వెలుగుతున్న దీపంలా
నిశ్శబ్దంగా బ్రతికితే ఏమిటి? నిరాడంబరంగా వెళ్ళిపోతే ఏమిటి?

కళ్ళలో దయా, స్పర్శలో నిర్మలత్వం
మాటలో నిజాయితీ, మనిషిలా స్పందించటం మరిచిపోకుండా ఉంటే చాలు
హాయిగా నవ్వటమూ, హాయిగా ఏడవటమూ పోగొట్టుకోకుండా ఉంటే చాలు

దృశ్యమేదైనా చూడటమే ఆనందంగా
శబ్దమేదైనా వినటమే ఆనందంగా
రుచి ఏదైనా ఆస్వాదించటమే ఆనందంగా
జీవితమెలావున్నా జీవించటమే ఆనందంగా ఉండగలిగితే చాలు

విశాలమైన మెలకువలూ, విశాలమైన నిద్రలూ తనివితీరా అనుభవిస్తే చాలు
వెలుపలా, లోపలా బోలెడంత విశ్రాంతి సంపాదించగలిగితే చాలు
బ్రతికినంత నిశ్శబ్దంగా, నిరాడంబరంగా మన చోటు ఖాళీ చేస్తే చాలు

*24 జనవరి 2011*

# నవ్వు

నవ్వుతున్నపుడు మనుషులెంత బావుంటారు, ఎంత కళగా ఉంటారు
చీకటిని దాచుకొంటున్నట్లు కాక కాంతిలోకి తెరుచుకొంటున్నట్లు
నవ్వకేంచేస్తామన్నట్లు కాక నవ్వటానికే పుట్టినట్లు నవ్వుతున్నపుడు
మనుషులు కాసేపు దేవతలవుతారు, సాహసులూ, స్వాప్నికులూ అవుతారు

వానలాంటి నవ్వులు, వెన్నెలలాంటి, వేసవిలాంటి నవ్వులు
రంగురంగుల పువ్వుల నవ్వులు, రంగురంగుల కలల నవ్వులు
నీటినడుముపై నీరెండమునివ్రేళ్ళు చక్కిలిగిలి పెడుతున్న నవ్వులు
మనని మనతో నింపే నవ్వులు, మననుండి మనని ఖాళీచేసే నవ్వులు

నవ్వు ఏదైనా ఒక నవ్వు నవ్వటం కన్నా ఏంకావాలి
మునిపంట అదిమేకొలదీ పొరలిపొరలే నవ్వులలో
శుభ్రంగా స్నానం చేసి చీకాకుల ధూళి విడిచి
కొసరుకొసరు నవ్వులతో ఒక నవ్వుల లోకం నిర్మించి
మనమే ఒక నవ్వులాగా వెలిగిపోవటం కన్నా ఏంకావాలి

తెలియరాని బరువేదో సాయంత్రపు చీకటిలా
చప్పుడు కాకుండా మనలో చేరుతున్నపుడు
తటిల్లతలాంటి నవ్వొకటి విడిచిపెట్టి చీకటిని భయపెట్టి
సరదాగా నవ్వేయటం చాతనైతే ఏంకావాలి

మన అనుభవాలు బెంగలుగా, విజయాలు భయాలుగా
మనకైనా చెప్పకుండా లోపలెవరో అనువాదం చేసేస్తుంటే
అద్దంలో మన బిక్కమొహం చూసుకొని, మనల్ని మనమే వెక్కిరించుకొని
తేలికగా, తూలికలా నవ్వుకోవటం తెలిస్తే చాలు కదా, మనకిక ఏంకావాలి

*23 ఫిబ్రవరి 2011*

# అలవాటు

ఒకరోజు రోజువారీ పనుల్లోంచి బయటపడి చూడాలి
మన వలయం మీద మనమే తిరుగుబాటు చేసి స్వేచ్ఛను ప్రకటించాలి

వాహనం విడిచి కాలి నడకన తిరగాలి
రోజూ చూసే తెలియని మనిషిని మొదటిసారి పలకరించాలి
బరువులన్నీ కాసేపు గాలికొదిలి, పగలంతా నిద్రపోవాలి. ఒక రాత్రి మేలుకోవాలి

ఆకాశాన్ని ఈ చివరనుండి ఆ చివరికి కొలిచిచూడాలి
దేవుడేమైనా ఇటీవల ఆకాశం కొలత మార్చాడేమో ఆలోచించాలి
చిననాటి నక్షత్రాలకీ, ఇప్పటికీ లెక్క సరిపోయిందో లేదో సరిచూసుకోవాలి

ఒంటరిగా కూర్చుని ఒకసారి నవ్వి చూసుకొని
మన నవ్వుకేమైనా మరామతు అవసరమేమో పరిశీలించాలి
ఏడవటం మరిచామో, ఏమో కాసేపు కన్నీరు రాల్చాలి

ఏదో ఒకటి అసలు ఎందుకు చేయాలో ఆలోచించాలి
ఆలోచన ఆగిపోతే ఏం జరుగుతుందో ప్రశాంతంగా గమనించాలి

ప్రపంచం మాయో కాదో తెలియదు కాని, అలవాటు మహామాయ
తిమ్మిరిలా అది క్రమ్మిందంటే
బ్రతుకు అందమూ తెలియదు, బాధా తెలియదు
దానిని విదిలించుకొని చూస్తే మరలా పుట్టినట్లుంటుంది

జీవనానందం తెలియాలంటే ఏదీ అలవాటు కాకుండా బ్రతకాలి
ఎప్పుడూ అలవాట్లకి జారబడకుండా నిలబడి ఉండాలి
బ్రతికివుండటం మాత్రమే అలవాటు కావాలి

తీరం వదిలిన దేన్నైనా ప్రవాహం తీసుకుపోయినట్లు
అలవాట్లను వదిలితే చాలు జీవితం తనతో మనల్ని తీసుకుపోతుంది

*10 మార్చి 2011*

# రెండు జీవితాలు

కొన్నిసార్లు భలే మాట్లాడతాము
వాక్యమొక విషయం చెబుతుంది, పదాలు మరొకటి చెబుతాయి
సంభాషణ ఒక సంగతి వివరిస్తుంది, ఉచ్చారణ మరేవో గుసగుసలాడుతుంది

కొన్నిసార్లు భలే పనులు చేస్తాము
పని ఒకదారిన కనబడుతుంది, ఫలితం మరోదారి చూస్తుంది

కొన్నిసార్లు మనం వింతగా ఉంటాము
ముందు ఒకందుకు నవ్వుతాము, వెనుక మరొకందుకు నవ్వుకుంటాము
పైకి ఒకందుకు ఏడుస్తాము, లోపల మరొకందుకు రోదిస్తాము

చాలాసార్లు మనం రెండు జీవితాలు జీవిస్తాము
మనల్ని రెండు చేసుకొని, రెండు సగాలు కోల్పోతాము
ఎంతకూ నిండని రెండు సగాలలో అర్థంలేని విషయాల సున్నాలు నింపుతాము

ఎపుడైనా అరుదుగా
ఒక పసివాడినవ్వో, పూలవికాసమో, పక్షుల ప్రవాహమో
మనని కాసేపు ఒకటి చేసి, మనని మనతో నింపి దీవించి వెళతాయి

ఎపుడైనా అరుదుగా
మనం ఏమరుపాటున దయగా, నిజాయితీగా ఉన్న క్షణాలు, నిండైన క్షణాలు
మనకు ఇంత శాంతిని ప్రసాదిస్తాయి, మనల్ని సారవంతంచేసి మాయమౌతాయి

*25 ఫిబ్రవరి 2011*

# మనిషి అపురూపం

ఏ మనిషైనా అపురూపంగా ఉంటాడు

ఉత్సాహంగా అతను వెళుతున్నపుడు
ఉదయం గదిలో వాలిన పొడవైన కిరణాలు
పగటి పని మీద వీధిలోకి వెళుతున్నట్లుంటుంది

అలసిపోయి అతను వస్తున్నపుడు
అస్తమయ కిరణాలు చేరుతున్నట్లుంటుంది

అతను నిద్రపోతున్నపుడు
నిలువెత్తు కిరణానికి చీకటి దుప్పటి కప్పినట్లుంటుంది

అతను మాట్లాడుతున్నపుడు
శబ్దాలలోపల కలలు దాచి పంచిపెడుతున్నట్లుంటుంది

అతను చూస్తున్నపుడు కళ్ళలో
ఎగురుతున్న సీతాకోకల రెక్కలపై గంతులేసే వెలుతురుంటుంది

అతను అన్నం తింటున్నపుడు
రేపటిరోజు కూడా జీవించే ఆనందంకోసం ధ్యానం చేస్తున్నట్లుంటుంది

సరళంగా, సహజంగా, ఉత్త మనిషిలా ఉన్నపుడు
ఏ మనిషైనా ఎంత అపురూపంగా ఉంటాడు

*5 మార్చి 2011*

# నిద్ర

ఏటిగట్టు దాటిన నది నేలంతా పరుచుకొన్నట్టు
ప్రేమాస్పదమైన వ్యక్తి ఊహలన్నిటినీ ఆక్రమించినట్టు
బలమైన కోరిక ఏదో జీవితమంతా వ్యాపించినట్టు
గాఢమైన నిద్ర మెలకువని పొదువుకొంటుంది

రేపు మళ్ళీ బ్రతకాలనే ఉత్సాహాన్నో
రేపు మళ్ళీ బ్రతకాల్సివస్తుందన్న భయాన్నో
కణమైనా మిగల్చకుండా తుడిచేసే నిద్రకన్నా స్వేచ్ఛ ఏముంది

తలుపులు మూసిన ఖాళీగదిలాంటి
దృశ్యాలన్నిటినీ ఆర్పేసిన రాత్రిలాంటి
మాటలన్నీ ఇంకిపోయిన మౌనంలాంటి నిద్రకన్నా
స్మృతులేవీ దయతో మిగలనివ్వని నిద్రకన్నా సుఖమేముంది

నేనైనా నాకు తెలియకుండా, అనుభవించే శ్రమకూడా లేకుండా
తల్లి గర్భంలోకి తిరిగి చేరినంత భద్రంగా చూసుకొనే నిద్రకన్నా
ఏ సృష్టి మూలంలోనో మనని కాసేపు దాచుకొనే నిద్రకన్నా ఓదార్పు ఏముంది

ఏ భేదమూ మిగలని, ఏ కలలూ, దిగుళ్ళూ మనపై పనిచేయని
పవిత్రమైన నిద్రలాగా మెలకువ ఉంటే జీవితమెంత మృదువుగా ఉంటుంది
గాఢమైన నిద్రలాంటి లోతైన మెలకువ ఉంటే జీవితమెంత ఉదాత్తమౌతుంది

*28 జనవరి 2011*

# వెళ్ళిపోయాక

చాలాసార్లు మనిషి వెళ్ళిపోయాక అతనితో జీవించటం మొదలుపెడతాము

ఈ నిమిషంలో అతను ఉండి ఉంటే
ఈ మాట అనేవాడు, ఇలా నవ్వేవాడు, ఇక్కడ కూర్చుని ఇలా చూసేవాడు
ఈ నిమిషంలో తాను ఊరికే ఉంటే చాలు
నేను నాలో నిండుగా ఉండేవాడిని అని తలపోస్తూ ఉంటాము

చాలాసార్లు మనిషి వెళ్ళిపోయాక ప్రేమించటం మొదలుపెడతాము
అతను వచ్చినపుడు, తనతో ఏమేమి తెచ్చాడో
తాను మిగిల్చిన ఖాళీలో కనుగొనటం మొదలుపెడతాము

అతను ఉండగా ఎందుకో ప్రేమించలేం
వెళ్ళిపోయాక ఎందుకో ప్రేమించకుండా ఉండలేం

తాను ఉండగానే కావాలంటే దొరకడన్న తెలివి ఉంటే
తన జీవనదాహం తీరేందుకు మనవంతు సాయం చేస్తే
అతనిలోని జీవనానందాన్ని సంపూర్ణంగా దర్శిస్తే
తన జ్ఞాపకాలు మనని బాధించవు, అతన్ని భూమికి బంధించవు

ఉండగానే తాను లేని కాలాన్ని ఊహించి
తనని జాగ్రత్తగా చూసివుంటే, అపురూపమైన దీవెనలా చూసుకొంటే
అతను ఎంత సంతోషించేవాడు, మన జీవితం ఎంత అందంగా ఉండేది

*5 మార్చి 2011*

# ఆగిపోతుంది

అకస్మాత్తుగా ఒక జీవితం ఆగిపోతుంది
ఒక జ్ఞాపకాల దీపం ఆరిపోతుంది
మానవ సంబంధాల ముడి ఒకటి విడిపోతుంది
మరికాసిని ఆశలు లోకంలోకి రాకుండానే వెనుదిరిగి వెళతాయి

జీవితం ఆగిపోయిన కబురందిన ప్రతిచోటా
వెచ్చనిశ్వాసలాంటి జీవితం కాసేపు చల్లబడుతుంది
అకస్మాత్తుగా వారి ప్రక్కన ఒక ఖాళీ ఏర్పడుతుంది
కార్యకలాపాల దారిలో ఊహించని మలుపు ఎదురౌతుంది

మరిచిపోతున్న బంధువెవరో వచ్చినట్లు పాతజ్ఞాపకాలు మేలుకొంటాయి
జీవితం ఆగిపోయిన మనిషి మరొకసారి తనవారి మెలకువనిండా జీవిస్తాడు

చిరునవ్వులతో ఆహ్వానించిన జీవితం కన్నీటితో వీడ్కోలు చెప్పిన తరువాత
మనిషి సారాంశాన్ని మిగుల్చుకొని తన స్వప్నం కొనసాగిస్తుంది

*25 జనవరి 2011*

# దుప్పటి అలలు

ఎగురుతున్న అలల్ని ఫొటో తీసినపుడు
అవి ఇంక ఎప్పటికీ వాలనట్లు
నిద్రలేచిన వెంటనే దుప్పటి మీది అలలు
వాలిపోకుండా మన మొహంలోకి చూస్తాయి

నిద్రలో ఉన్నంతసేపు
మంచం లేదు, దుప్పటి లేదు, అలలు లేవు
మెలకువలోకి రాగానే
ఒక్కొక్కటీ తమని సర్దమని చెపుతుంటాయి

తప్పదు మరి, చాలా సర్దుకోవాలి
నిద్రలో మనని భరిస్తున్న ప్రపంచాన్ని
మెలకువలో మనం భరించాలి

కమ్మని నిద్రలోకి సుఖయాత్ర చేయటానికైనా
దుప్పటినీ, ప్రపంచాన్నీ
సాయంత్రానికి చాతనైనంత సర్ది ఉంచుకోవాలి

*23 ఫిబ్రవరి 2011*

# పాతవి

పాత ఆలోచనలు జరాగ్రస్త శరీరంలా తడబడుతున్నపుడు
పాత అనుభవాలు శిశిరంలో వృక్షంలా ఉత్సవరహితమైనపుడు
పాత అలవాట్లు పాదాలను చురుకుగా కదలనీయనపుడు
వాటిని చెల్లని పాతనాణాల మూటల్లా విడిచివేయాలి

ఏవీ కావాలని పోగేసుకొన్నవి కావు
ఏవీ నిలుపుకొంటే నిలిచేవీ కావు

ప్రతి శబ్దమూ నిశ్శబ్దాన్ని మోసుకొచ్చినట్టు
ప్రతి దృశ్యమూ ఏదో రహస్యాన్ని రెక్కలపై తీసుకొచ్చి వాలినట్టు
ప్రతి ఆలోచనా, అనుభవమూ జీవితం కాంతిని మోసుకొస్తాయి
జీవితస్పర్శను మిగిల్చి తప్పుకొంటాయి

తీరం చేరగానే పడవ దిగిపోయినట్టు
వాన వెలిసిపోగానే గొడుగువిడిచి ఆకాశాన్ని ఆహ్వానించినట్టు
అనుభవాలని విడిచిపెట్టి మెలకువలోకి నడిచివెళ్ళాలి

మనకు తెలియని ఈ మహాలోకంలో
ఎప్పుడూ శబ్దదృశ్యాల చిటికెన వ్రేళ్ళు పట్టుకొని సంచరిస్తున్నా
విశ్రాంతి తెలియని సాహసిలా, స్వాప్నికుడిలా
ఎప్పటికప్పుడు వాటిని ఖాళీ చేసుకొంటూ కొత్త మెలకువలోకి ప్రవేశించాలి

*22 ఫిబ్రవరి 2011*

# మనలో ఒకడు

ఎదుగుతున్న మనలో ఒకడిని చూసి గర్వించాలి

మన మెలకువలన్నీ వృధాగా ఒలకబోసుకొంటున్నపుడు
అతను ప్రతిమెలకువనీ ప్రార్ధనగా మలచుకొన్న వైనాన్ని గమనించాలి
మనం దీపాలార్పి పడుకొన్నపుడు
అతను పగలుకోసం చీకటిలో వెదకటం తెలియాలి

ఒక కన్ను మూసి, ఒక కన్ను తెరచి కలలు కనే మనమధ్య
రెండు కళ్ళూ తెరిచి కలల్లోకి దారి కనుగొనే అతని ఉత్సాహం చూడాలి
వేయి మొరటుచేతులు రాల్చినా మరింత దు:ఖరసం పీల్చుకొని
మరి వేయి పూలుగా వికసించి పలకరించే అతని ఆర్తి చూడాలి

రాబోయే యుగాలని మనకోసం నిద్రలేపుతున్నందుకు
మనలోని ఒకడిలో మనని చూసుకొని ప్రేమించాలి

*8 ఫిబ్రవరి 2011*

# స్నేహం

ఒకసారి బాల్యస్నేహితుడు కనిపిస్తే నన్ను గుర్తుపట్టావా అని అడిగాను
అతను తన స్మృతిమైదానమంతా తిరుగుతూనే
లేదనలేక ఔనన్నాడు, మొహమాటంగా నవ్వాడు
అతనిప్పుడు బాల్య స్నేహితుడు కాదు, సగటు సౌజన్యం తెలిసినవాడు

ఎందుకు మరిచిపోయాడు
కలిసి ఆనందించిన రోజులని, నాటి సావాసాలనని చాలాసార్లనిపించేది

బహుశా ఆరోజుల్లో అతను నాతో స్నేహం చేయలేదు
నాలోని తన బాల్యంతో, మా ఆటలతో, ఆనందంతో స్నేహం చేసాడు
అందువలన తన ఆనందానికి రెండవకొసనున్న నన్ను మరిచాడు
బహుశా, అతనే సహజంగా ఉన్నాడేమో

బలమైన భావంతోనో, సందర్భంలోనో చాలామందిని కలుస్తాం
అవి కనుమరుగయాక వాటితో పరిచయమైన మనుషుల్నీ మరిచిపోతాం

అందరినీ, అన్నిటినీ సమాచారంలా గుర్తుంచుకోవటం సరేకాని
వాటితో పెనవేసుకొన్న ఉద్వేగాలు మరిచిపోవటం మంచిది
స్నేహం, కోపం, సంతోషం, బాధ – ఉద్వేగం ఏదైనా
దానిని మరిచినపుడు జీవితం స్పష్టంగా ప్రతిఫలిస్తుంది

మనుషులూ, సందర్భాలూ మరలా ఎదురైనపుడు
తాజా మనిషినీ, సందర్భాన్నీ తాజా హృదయంతో తాకటం బావుంటుంది

నా బాల్యంలోని మిత్రుడు నాతోకాక బాల్యంతో స్నేహం చేసినట్లు
మానవ సంబంధం ఏదైనా, సందర్భం ఏదైనా
ఎదుటి మనిషితో కాక అతని జీవితంతో స్నేహం చేయటం
ఎప్పటికీ సజీవంగా ఉంటుంది
బహుశా అది నిజమైన స్నేహమవుతుంది

*29* మార్చి *2011*

# యవ్వనకాలం స్నేహితులు

యవ్వనకాలపు స్నేహితులు కలిసినప్పుడల్లా మళ్ళీ యవ్వనంలోకి ప్రవేశిస్తాము
మర్యాదలేని పలకరింపులూ, ప్రేమ నిండిన తిట్లూ
పోగొట్టుకొన్న వెలుతురుల్ని పోగుచేసి చూపిస్తాయి
చీకట్లు ముసిరే మలివయసులో మిణుగురులై ఎగురుతాయి

యవ్వనకాలపు స్నేహితుల్ని తలచుకొన్నప్పుడల్లా
బ్రతుకు అందమేదో మనచుట్టూ మంచులా ముసురుకొంటుంది

పొగమంచు ఆనందంవంటి బాల్యంలోంచి
ఎదురొచ్చే గ్రీష్మకిరణాల జడిలోకి అప్పుడపుడే అడుగుపెడుతూ

చిత్రకారుని రేఖలవెంట తెల్లకాగితంపై తేలుతున్న బొమ్మలా
సర్దుకొనే అలలవెంట కొలనులో తేరుకొంటున్న ప్రతిబింబంలా
అప్పుడపుడే తేలియాడే వ్యక్తిత్వాలతో, మనుషులౌతూ, అయ్యామనుకొంటూ
కలలలోకీ, కలతలలోకీ కొత్తగా పరిభ్రమించే

తొలియవ్వన దినాల స్నేహితులు కలిసినప్పుడల్లా
కలిసిన స్నేహితులు కలవనివాళ్ళని తలచినప్పుడల్లా

ఒక ఆనందమూ, ఒక దిగులూ
ఒక సంతృప్తీ, ఒక అనాసక్తీ
ఒక స్పందనా, ఒక సంయమనమూ
మనలోపల వానలా ముసిరి మనని ఇంద్రధనస్సులు చేస్తాయి

యవ్వన దినాల స్నేహితులు కలిసినప్పుడల్లా, తలచినప్పుడల్లా
మనమింకా బ్రతికివున్న ఉత్సాహం ఒకరినుండి ఒకరు పొందినట్లుంటుంది
మనమెప్పటికీ బ్రతుకుతామన్న భరోసా ఒకరికొకరు బహూకరించుకొన్నట్లుంటుంది

బహుశా మన యవ్వనదినాల కన్నా మనం లోకంనుండి పొందాల్సినదేముంటుంది
మనం లోకానికి ఇవ్వాల్సినదేముంటుంది

*25 ఫిబ్రవరి 2011*

# ఆమె ఎవరో

ఆమె ఎవరో తెలియదు కాని ఫోనులో ఆమె కంఠస్వరం బావుంది
వీణారవాల్ని దయలో ముంచి తీసినట్లుంది

మాట్లాడాలన్న ఉత్సాహానికీ, మాటలెందుకన్న బిడియానికీ
మధ్య సన్నటితీగపైన మరీ మెలకువగా, తేలికగా నడిచీ, నడవనట్లు
అక్షరాల పక్షుల రెక్కల్ని విప్పింది ఆమె కంఠస్వరం

ఆమె జ్ఞాపకం పాతబడని ఊహలా సంచరిస్తూవుంది
రాలిపోని పుష్పంలా వికసిస్తూవుంది
తడి ఆరని వేదనలా, ఆనందంలా మేలుకొంటూవుంది

ఆమె ఎవరైనా, నా కోమలత్వాన్ని మళ్ళీ నాకు పరిచయం చేసింది
ఆమె నా సహచరి తొలిరోజుల మాటల్ని మళ్ళీ గుర్తుచేసింది
బహుశా ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడికీ తొలిసారి ఇలాగే వినిపిస్తుంది

ఎవరైనా తెలియనంత వరకూ ఆకర్షణ ఉంటుంది
తెలియకపోవటం మన ఊహల్ని విశాల గగనంలోకీ
గగనంలో దాగిన వేనవేల లోకాలలోకీ ఎగిరేలా చేస్తుంది

తెలియటమంటేనే, తెలిసివుండటానికి అలవాటుపడటమంటేనే
ఒక కలని విషాదంలోకి అనువదించుకొన్నట్లుంటుంది

కొన్నిసార్లు ఎవరో తెలియకపోవటమే బావుంటుందేమో
అనేక విషయాలు తెలిసీ, తెలియనట్లుంటేనే బావుంటుందేమో

అప్పుడు మనలో మెలకువ ఉంటుంది.
మెలకువలో అన్వేషణ ఉంటుంది. కవిత్వముంటుంది. కథలుంటాయి
మన జీవితం మునుపెవరూ పాడని పాటలా ఆకాశాన్ని సారవంతం చేస్తుంది
అప్పుడు మన కనుకొలకుల్లోంచి ఒక నక్షత్రం తారాలోకం చేరుతుంది

*31 జనవరి 2011*

# మృదు విషాదం

పూవు తుమ్మెదని ఆకర్షించినట్లొకసారి
దీపం శలభాన్ని ఆకర్షించినట్లొకసారి
అతను ఆమెని ఆకర్షిస్తాడు. ఆమె అతన్ని ఆకర్షిస్తుంది

ఆకర్షణ వారి మధ్య ఒక కాంతి గోళం వెలిగిస్తుంది
దానిలో ఒక లోకాన్ని సృజిస్తుంది
ఆ లోకంలో కోమలత్వాన్నీ, అన్వేషణనీ, సౌందర్యాన్నీ, దు:ఖాన్నీ చూపిస్తుంది
వారి లోకంలో వారే తప్పిపోయే తమాషాలు చేయిస్తుంది

తుఫాను అలలాంటి బలమైన ఆకర్షణ,
ఆనందంలాంటి, దు:ఖంలాంటి, కోపంలాంటి బలమైన ఆకర్షణ
ఈ లోకాన్ని కాదని ఎగిరిపొమ్మంటుంది
అప్పుడు భూమిలాంటి బలమైనదేదో ఎగరలేని విషాదాన్ని
వలలాగా, వలలాంటి చీకటిలాగా కనులముందు పరుస్తుంది

కల బలమైనది.
అంతకన్నా ఈ లోకం బలమైనది. అంతకన్నా జీవితం బలమైనది
అంతకన్నా లోలోపలి ఉనికి బలమైనది, ఉనికి పట్ల మెలకువ బలమైనది
అవి బలంగానే, అయినా మృదువుగానే, నిర్దయలాంటి దయతోనే
వారి కలల రెక్కల్ని ముడిచి, పొదివి పట్టుకొంటాయి

ఒక స్వప్నం నెమ్మదిగా జీవితంలో కరుగుతుంది
ఒక విషాదం వారి జీవితాలని సారవంతం చేసి వెళుతుంది

అప్పుడు వారు నవ్వినప్పుడల్లా
వారి పెదాలపై ఎవరికీ అంతుపట్టని వెలుతురొకటి పారాడుతుంది
వారి కన్నీరు జారినప్పుడల్లా
వాటి బిందువులలో లోలోపలి ప్రశ్నలేవో మెరుస్తుంటాయి

కాలాలు మారతాయి. దేశాలు మారతాయి
దేహాలు మారతాయి. దేహాల దశలు మారతాయి
కల మళ్ళీ పూవులా పూస్తూనే ఉంటుంది
కల మళ్ళీ పూవులా రాలుతూనే ఉంటుంది

ఒక మృదు మధుర విషాదం
అంతూదరీలేని అన్వేషణలోకీ, గమ్యాలలోకీ, జవాబులలోకీ, ప్రశ్నలలోకీ
వారి జీవితాలని పక్వం చేస్తూనే ఉంటుంది

*6 ఫిబ్రవరి 2011*

# ప్రేమలోంచి జీవితంలోకి

నేను మగవాడనే లేతనీలి భావాన్ని
నీవు స్త్రీవనే స్వచ్ఛధవళ భావానికి పూర్తిగా సమర్పించాను
గరుకు చీకటిగర్భంలో ఒంటరి విత్తనంలా ముడుచుకొన్న నేను
నీ కోమల స్నేహ పరిమళంలోకి పూవులా వికసించాను

అంతులేని దయతో మనని ఒకరినొకరికి చూపిన కాలం
నాకు అర్థంకాని వాత్సల్యంతో వేరుచేసినపుడు
పూవుని మరలా విత్తనంలా మారమన్నాను
కానీ వేరు తొలగించిన బాధ నాలో పీడకలలా ముసురుకొంది
నువు రాకముందు నుండీ నాలో వున్న చీకటిని
నువు వచ్చి వెళ్ళాక గమనించి భయపడ్డాను

పాతాళంనుండి ఎగసివచ్చిన పవిత్ర జలధారవంటి దు:ఖంలో
పసివాడిలా నేను పదేపదే స్నానం చేసినా
నీలో కరిగిన నా నీలిఛాయ తిరిగి నన్ను చేరటానికి నిరాకరించింది

. . .

కాలం నిజంగా కరుణామయి

నా లోపలి చీకటిలో నేనెవరినో, ఎక్కడ ఉన్నానో
తెలియని నిద్రా గర్భావాసంలో మునిగిన రోజులలో,
వచ్చినట్లే తెలియని సన్నని కిరణంలాంటి, కొనఊపిరిలాంటి జీవనకాంక్షని
కాలం ప్రభాతపవనంలా, అమ్మలా, మానవ హృదయాలలోని దయలా కాపాడింది.

నెలల తరబడి నక్షత్రాలు నేను పలకరించకుండా తరలిపోయాక
క్రమంగా సూర్యోదయంలా మృదువుగా జీవనస్పృహ మేలుకొంది

ఇప్పుడు చూస్తున్న జీవితం గత జీవితం కాదు
తన బూడిదలోంచి పునరుత్థానం పొందే, ఏదో పురాణపక్షిలా
నా కలల, భయాల భస్మంలోంచి పునరుత్థానం పొందిన సరిక్రొత్త జీవితం
తన మరణాన్ని నవ్వుతూ పలకరించి వచ్చినవాడిలా
క్షణక్షణమూ సాహసంతో, ఉత్సాహంతో పరవళ్ళు త్రొక్కే జీవితం

ఇప్పుడు నేను పురుషుడిని కాదు.. స్త్రీనీ కాదు..
నేను మానవుడినీ.. మరే ప్రాణినీ కాదు..
ఏ భావాల మేఘాలూ లేని స్వచ్ఛ వినీల గగనాన్ని.. నేను స్వచ్ఛమైన జీవితాన్ని

. . .

నువు వెళ్ళేటపుడు నీ నన్ను జాగ్రత్తగా గుర్తుంచుకోమని పదేపదే చెప్పానని జ్ఞాపకం
నీ జ్ఞాపకాలు నాముందు నిలిచినప్పుడు నా పెదాలపై దయగా చిరునవ్వు మెరుస్తుంది

ఇప్పుడు నువ్వు నాకు దూరంగా లేవు
నువ్వు దగ్గర ఉన్న రోజుల్లో మనమధ్య తెలియని దూరం ఉండేది
ఇప్పుడు మనమధ్య తెలియని సాన్నిహిత్యం కనిపిస్తోంది

మన జీవితాలు ఒకటికాలేదు కానీ మనం ఒకటే జీవితమని తెలిసింది
అన్ని జీవితాలూ కలిపి ఒకటే జీవితమని అర్థమౌతుంది

ఏ బంధంలేని ఈ అంతంలేని జీవన మైదానంలోకి
నిన్ను తీసుకురాలేకపోయానని ఎపుడైనా అనిపించటం మినహా
నేస్తం– నేను బాగున్నాను.. జీవితమంత నిండుగా, నదిలా ఉన్నాను

*16 మార్చి 2009*

# కలిసి ఉండటం

కలిసి ఉండటమంటే ఏమిటి, విడిపోవటమంటే ఏమిటి
కలిసి ఉండటానికి మొదలేది, విడిపోవటానికి చివరేది
కలిసి ఉండటం, విడిగా ఉండటం స్పందనలోనివా, సాంకేతికమా

ఒకే రాత్రిలో కలుసుకొంటున్న నక్షత్రాలలా
ఒకే నిద్రలోకీ, ఒకే మృత్యువులోకీ ప్రవేశించినపుడు
కలిసి ఉంటామా, విడిగా ఉంటామా

మనం ఎదురైనపుడు
మన ముఖాలలో పూలు వికసిస్తే విడిపోగలమా
మేఘాలు కదిలితే కలిసి ఉండగలమా

అందరూ మట్టిముద్దలా కలిసి ఉండాలని
ప్రతి ధాన్యంగింజతోనూ జీవితం మనలోకి సందేశం పంపుతుంది
ప్రేమవృక్షాల్ని పెకిలించివేసుకొని ఇసుకరేణువుల ఎడారిలా విస్తరిస్తున్నాం

ఒకరి భయం కలిసుందామన్నపుడు
ఒకరి భయం విడిపోదామన్నపుడు
ఒకే భయంలో ఇద్దరూ కలిసి జీవిస్తారు

ఒకే ప్రేమలో ఇద్దరూ కలిసి జీవించటం తెలిసినపుడు
తగినంత కలిసి ఉండటం, తగినంత విడిగా ఉండటం
సహజంగా, హుందాగా, ఒక మాటైనా లేకుండా జరుగుతాయి

పిల్లల్లా, పక్షుల్లా, మేఘాల్లా
సరిహద్దుల గొడవే తెలియని సహజమైన సంస్కృతిలోకి
మనం ఇంకా చాలాదూరం నడవాలి. ఇక నడవాలి

*23 ఫిబ్రవరి 2011*

# మానవ సంబంధం

పరిమళానికి పవనం వాహిక అయినట్లు
మనలోని భావాలకి మానవ సంబంధం వాహిక
గాలివలెనే మన సంబంధమూ తనంత తాను ఉదాత్తమూ కాదు, హీనమూ కాదు
మన భావాల పరిమళాలు మన అనుబంధాన్ని సంతోషానికో, విచారానికో నడిపిస్తాయి

మనం కలుసుకోవటం ఉత్త వినోదమైనపుడు
బరువైన కాలాన్ని తేలికగా తోసేందుకు మాత్రమే మనం కలిసినపుడు
మనం విడిపోయే ప్రతిసారీ
ఒక శూన్యాన్ని రెండు చేసుకొని పెనువిషాదాన్ని మోసుకొంటూ వెళిపోతాం

ఉదాత్తభావాలతో మన అనుబంధాన్ని ఉన్నతీకరించుకోవాలి
మనం చాలాదూరం కలిసి ఎదిగాక
అకస్మాత్తుగా మన అనుబంధం గాలివంటిది కాదని
మనం ఒకటేనని,
మనమధ్య అనుబంధం ప్రయాణించే దూరమైనా లేదని తెలుసుకొంటాం

మనం రెండు ఆకాశాలుగా కనిపించే ఒకటే ఆకాశమని తెలివితెచ్చుకొని
ఎప్పటికీ కలిసివుంటాం, రెండు నిండు గగనాలవలే సంచరిస్తాం

*4 ఏప్రిల్ 2011*

# అతను - ఆమె

ఆమె తెలివైనదని అతను
అతను దయగలవాడని ఆమె
మనస్ఫూర్తిగా భ్రమపడతారు

ఆమె తెలివిలేనిదని అతను
అతను దయలేనివాడని ఆమె
అవసరానికి మించి తెలుసుకొంటారు

ఆమె దయగలదని అతను
అతను తెలివైనవాడని ఆమె
దయగా తెలివితెచ్చుకొని శాంతిపొందుతారు

*28 జనవరి 2011*

# మారాలేమో

ఏదో రాద్దామని కూర్చుంటాడు
కనిపించని లోకాలనుండి వినిపించే మాటలకోసం
శ్రద్ధగా ఎదురు చూస్తుంటాడు

అకస్మాత్తుగా గది తలుపులు తెరుచుకొని
వెలుతురూ, మనిషీ, మాటలూ ప్రవేశిస్తాయి

రాబోతున్న రహస్య దేవతలెవరో
ఆకాశం గోడ వెనుక దాగి ఉండిపోతారు
వచ్చిన మనిషీ రాబోయే వెలుతురునీ, మాటలనీ
తనతో తీసుకువెళుతూ తలుపులు మూసేస్తుంది

అర్ధమయేలోపు సన్నివేశాలు చెరిగిపోతుంటాయి
సర్దుకొనేలోపు సందర్భాలు మారిపోతుంటాయి
మారే సన్నివేశాలతో మారవలసిరావటం కష్టమే
మారే సందర్భాలతో మారకపోవటమూ కష్టమే

ప్రతి పిల్లగాలికీ ఎగిరివాలే ధూళికణంలాగా
ప్రతి మార్పులోకీ ప్రవేశించటం చాతనైతే బాగుండును
ఏ నీడలూ అంటుకోని ఆకాశంలాగా
ఏ మార్పులూ అంటుకోని ఆనందమై ఉంటే బాగుండును

*24 జనవరి 2011*

# సంపాదన

పేరూ, ధనం, విజ్ఞానమూ, అధికారం
బల ప్రదర్శన వేదిక ఏదయినా కావచ్చును
సంపాదించి, మరింత బలం సాధించి ఏం చేయాలి
జీవనానందం చుట్టూ సమాధి నిర్మించి ఏం చూడాలి

చిననాటి చల్లని వెన్నెల చూపులు జారిపోయినపుడు
నిష్కపటంగా, నిస్సంకోచంగా ఇక నవ్వలేనపుడు
ఆనందంలోకి హాయిగా ఎగిరే మంత్రం మరిచినపుడు
అనుకోగానే సులువుగా నిద్రలోకి మాయంకాలేనపుడు

సాటివారి దైన్యం సదా నిందితుడిని చేస్తున్నపుడు
నిండుగా, హుందాగా, నిశ్చింతగా, నిర్మలంగా
జీవనచిత్రంనుండి నిష్క్రమించటం చాతకానపుడు

సంపాదన అర్థమేమిటి, సమర్థత సారాంశమేమిటి
ఓటి సంతోషాల మోత వలన ఒరిగినదేమిటి
అందంలేని లక్ష్యాల సాధనలో ఆనందం ఒంపుకొన్నాక
ఖాళీ మనుషుల, ఖాళీ చప్పట్లు మనలో నింపినదేమిటి

దేవుడినెందుకు నిందిస్తాము
తనలాగా మనని సృజించుకొని పంపిన తొలిరోజులు మరుస్తాము
ఏ గర్వం జీవితాన్ని నరకం చేస్తుంది
ఇప్పుడు ఏ వివేకం కోల్పోయిన స్వర్గం తిరిగి తెస్తుంది

*26* మార్చి *2011*

# పిల్లల్ని ప్రేమిస్తే చాలు

పిల్లల్ని ప్రేమించటం నేర్చుకొంటే చాలు
వారికోసం ఒక మంచి ప్రపంచాన్ని వారే సృష్టించుకొంటారు

పిల్లల్లోని వంశాంకురాల్ని కాదు
మనం బ్రతుకుతున్న లేదా బ్రతకలేకపోయిన
మేడలూ, కార్లూ, దర్పమూ, పరివారమూ కాదు
వారిలోని కొత్త వినియోగదారుడిని కాదు

వారి అందమూ, తెలివీ, బలమూ కూడా కాదు
వాటిని ప్రేమించటం వాటిని ప్రేమించటమే
పిల్లల్ని ప్రేమించటంకాదు

మనం కేవలం పిల్లల్ని ప్రేమించాలి
వారు ఈ లోకంలోకి రావటాన్ని ప్రేమించాలి
వారి రూపంలో జీవితం కొనసాగటాన్ని ప్రేమించాలి
కేవలం వారి ఉనికి మనకు బహుమతిలా ప్రేమించాలి

మన హృదయమంతా తెరిచి వారిముందు పరిచి
వారిని ప్రేమిస్తే చాలు
వారినుండి ప్రేమించటం నేర్చుకొంటూ
వారు ప్రేమించటం మరిచిపోకుండా కాపాడుకొంటే చాలు

పిల్లలు ఈ ప్రపంచాన్ని దేవాలయం చేసి చూపిస్తారు

*16 మార్చి 2011*

# తలుపులు

అడగకుండా తలుపులు తోసుకొని లోపలికి వస్తారు పిల్లలు
బయట ఉన్న ఆకాశమే లోపల ఉంటుంది కదా అని వాళ్ళ ఊహ
గదిలోపలి ఆకాశాన్ని ఎవరెత్తుకుపోతారోనని మనకి బెంగ

మనం శ్రమపడి ఊహించుకొన్న బూచాళ్ళు
మన ఆకాశం ఎప్పుడో ఎత్తుకుపోయారని మనకి తెలీదు

పోనీ వచ్చారు కదా అని రానిచ్చినందుకు
మన పెద్దమనసుతనానికి మురిసిపోతూ వుంటే
తలుపులు వెయ్యకుండానే వెళ్ళిపోతారు పిల్లలు

తలుపులు లేకపోతే బ్రతుకేమైపోతుందో ఊహించలేని మనకి
తలుపులు లేనిచోట జీవితం ఉంటుందని అర్థం కాదు

*24 జనవరి 2011*

# అసందర్భం

మిట్ట మధ్యాహ్నం మాగన్నుగా నిద్రపోతున్నపుడు
బిలబిలమంటూ పిల్లలు గదిలోకొస్తారు

వారిలోపల ఉబుకుతున్న ఉత్సాహమేదో
తేనెటీగల దండులా ముసురుకొన్న ప్రణాళికల ఝుంకారంతో
ప్రపంచంలోకి తోసుకొస్తూ ఉంటుంది

పగలున్నది నిద్రపోయేందుకు కాదు,
ఆడుకొనేందుకని జీవితం వారితో సందేశం పంపుతుంది

అసందర్భంగా ఈ అల్లరేమిటని విసుక్కొంటాం కాని

అసందర్భమే అనేకసార్లు
మనకు కొత్త సందర్భాలను బహూకరించిందని
మనలో కొత్త ప్రశ్నలనీ, కొత్త జవాబులనీ ప్రవేశపెట్టిందనీ మరిచిపోతాం

ఏ సందర్భమూ లేని సమయమే
నిజంగా జీవించే సందర్భమని మరిచిపోయాం కనుక
పిల్లల్ని అసందర్భంగా ఈ జీవించటమేమిటని విసుక్కొంటాం

*27 ఫిబ్రవరి 2011*

# గుమ్మంతెర

ఏదో రాసుకొంటున్నపుడు
అకస్మాత్తుగా ఎవరో వచ్చినట్టు గుమ్మంతెర లోపలికి వస్తుంది
ఎవరా అని చూసేసరికి
పొరపాటున గదిలోకి వచ్చినట్టు బయటకు ఎగురుతుంది

పిల్లలు అమ్మచుట్టూ తిరుగుతున్నట్టు
గాలిపిల్లలు తెర ముందూ వెనుకా దోబూచులాడుతుంటాయి

ఏ కదలికా లేని ఆకాశమే గుమ్మం ముందూ వెనుకా ఉన్నట్టు
ఏ స్పందనా లేని కాలమే ఎప్పుడూ విస్తరించి ఉన్నపుడు
ఒక తెర ఉండటం బావుంటుంది
పలుచని తెరలాంటి ప్రపంచ స్పర్శ బావుంటుంది

గోడలన్నిటినీ రబ్బరుతో చెరిపి, తెరలుగా దిద్ది
తెరలమధ్య పిల్లలందరం సందడి చేస్తే బావుంటుంది

*23 ఫిబ్రవరి 2011*

# బంగారంషాపులో

ప్రొద్దుటి కిరణాలని ముక్కలుగా కత్తిరించి బంగారమనీ
పున్నమి వెన్నెలని ముద్దలుగా చేసి వెండి అనీ
అమ్మేవారు అమ్ముతారు. కొనేవారు కొంటారు

మన ఉనికిమీద బంగారం వర్షించే ఉషోదయాలూ
మన నుదుటిమీద వెండిముద్దులు ఒంపే పున్నమిరాత్రులూ
తమని అమ్మమనీ అడగవు. కొనమనీ బ్రతిమాలవు

అమ్ముకొనే ఆట మొదలైన ప్రతిసారీ
ముందు మన జీవితాలని చవకగా అమ్ముతుంటాము

బంగారంలాంటి కన్నీరూ, వెండిలాంటి చిరునవ్వూ
కాంతులు కోల్పోయి లోహాలుగా ఘనీభవిస్తుంటాయి

అమ్మటమూ, కొనటమూ ఎరగని
చెట్లలాగా, పిట్టలలాగా స్వచ్ఛంగా బ్రతకటానికి
మన నాగరికత ఎదగటానికి
ఇంకా ఎన్ని యుగాలు పడుతుంది

*24 జనవరి 2011*

# గేదెలు

పొలంలో కట్టుతాడు విప్పగానే గేదెలు
నిధి ఏదో దొరికినట్టు గంతులేస్తూ పరుగులు తీసాయి
వాటి పట్టరాని సంతోషం చూస్తే
దేవుడు కాసేపు వాటికి రెక్కలిస్తే బాగుండుననిపించింది

ఎందుకంత గెంతుతున్నాయి అని మిత్రుడినడిగితే
అవి స్వేచ్ఛ దొరికిందని సంబరపడుతున్నాయి
తీరా ఇంటికి వెళ్ళాక మళ్ళీ కట్రాళ్ళ దగ్గర నిలబడతాయని చెప్పాడు

కొంచెం దూరంపోయాక వాటిని చూస్తే గంతులాపి
వెనక్కి నడుస్తున్నట్టుగా ముందుకి నడుస్తున్నాయి
మళ్ళీ స్వేచ్ఛ హరించుకుపోయే సమయం ముందుందని
ఆపాటికి జ్ఞానోదయం కలిగినట్టుంది

ఈ మాత్రానికి తొందరెందుకని
స్వేచ్ఛా సమయాన్ని ఒక్కొక్క అడుగేస్తూ నెమరేస్తున్నాయి

గేదెలని చూస్తే నవ్వూ, జాలీ పుట్టాయి కాని
మనల్ని చూసుకొంటే అవికూడా రావు

ఇక కానివ్వమని కట్రాళ్ళదగ్గర నిలబడితే
ఎవరో ఒకరు వాటిని కట్టాలి

మనం తెలివైన వాళ్ళం గనుక మనల్నెవరూ కట్టనక్కరలేదు
మనల్ని మనమే శ్రద్ధగా, జాగ్రత్తగా బంధించుకొంటాం

*23* మార్చి *2011*

# మేఘంలా రావాలి

మనిషి వస్తే మేఘంలా రావాలి
ఉన్న నాలుగు చినుకులూ రాల్చి
తరువాత ఏంచేయాలో తెలియక తెల్లబోయే పిల్లమేఘంలా కాదు

నిదానంగా, హుందాగా
మొదలూ, చివరా కనిపించని మహామేఘంలా రావాలి

ఎక్కడెక్కడి ఆవిరినీ తనలోకి నింపుకొంటూ
చల్లగా, జల్లులగుంపులా కనబడుతూనే
ఉరుముల్నీ, పిడుగుల్నీ, మెరుపుల్నీ ఎక్కడ దాచుకొందో తెలియని
మహామేఘంలా మనిషి రావాలి

మనిషి మేఘం కావాలంటే
అతనిలో సరిహద్దులు లేని ఆకాశం ఉండాలి
వేసవిఎండతో కడిగిన ఆకాశంలా మనిషి ఉన్నపుడు
అతను వద్దనుకొన్నా మేఘంలా మారతాడు

అతని ప్రమేయం లేకుండానే
అదృశ్యసంచారం చేసే సూర్యకిరణాలు
అతనిపై వాలి రంగులలోకాల్ని ప్రదర్శిస్తాయి

అప్పుడతను కావలసినంత నీటితో మనల్ని తడిపి
మన హరితస్వప్నాలకోసం ఎండనీ, ఆకాశాన్నీ మిగిల్చి
మళ్ళీ అవసరమైన కాలం వరకూ మాయమౌతాడు

*16 మార్చి 2011*

# ప్రకృతి నేర్పుతుంది

పూవులు మనకు చూడటం, తాకటం నేర్పుతాయి
సున్నితంగా చూడటమెలాగో, రంగుల్లోకి మేలుకోవటమెలాగో నేర్పుతాయి
మొరటుగా తాకితే ఏవైనా ఎలా రాలిపోతాయో నేర్పుతాయి

పక్షులు మనకు పాడుతూ, ఎగరటం నేర్పుతాయి
భయంలేకుండా ఉండటం చాతనైతే
మనం ఎలా పాడగలమో, ఎగరగలమో నేర్పుతాయి

చెట్లు మనకి ఎదగటం, ఇవ్వటం నేర్పుతాయి
ఎదగాలంటే ఓర్చుకోవాలని,
బరువులేకుండా గాలికి ఊగాలంటే మనకున్నవి ఇవ్వాలని నేర్పుతాయి

నేర్చుకొనే తపన ఉండాలి కాని
ప్రకృతి మనకి నాగరికత నేర్పుతుంది
నిజమైన బ్రతుకు నేర్పుతుంది, బ్రతుకు అందం నేర్పుతుంది

*3 మార్చి 2011*

# అద్దం

అద్దం అర్ధంకాకుండా ఉంటుంది
అది మనని చూస్తుందో మనం దానిని చూస్తామో తెలీదు
మన ముఖం దానిలో చూస్తున్నపుడు
దాని ముఖం మనలో చూస్తుందో లేదో తెలీదు

మనం నిద్రపోతున్నపుడైనా
అది నిద్రపోతుందా అని క్రీగంటితో గమనిస్తే
వీధిగుమ్మం తలుపు బార్లాతెరిచినట్టు
అద్దమంత కన్ను తెరుచుకొని
గదినంతా కావలి కాస్తున్నట్టు చూస్తూనే ఉంటుంది

చలనం లేకుండా ఎలా ఉంటావు
కాస్తంత కలలైనా కనరాదా అద్దమా అంటే
నేను పుట్టటమే లోకాన్ని కలగనటానికి పుట్టానంటుంది

అద్దం అర్ధంకాకుండా ఉండిపోతుంది
అది నిద్రపోతుందో, కలగంటుందో, మెలకువగా ఉందో
ఎప్పటికీ అర్ధంకాకుండా ఉండిపోతుంది

మనం అద్దంలా ఉండగలిగితే బాగుండును
నిద్రలోని కలలాంటి మెలకువతో ఉంటే బాగుండును
ఎప్పుడూ ఒకేలా మనని పలకరించే అద్దంలా ఉండగలిగితే బాగుండును
కనీసం అద్దంలోని మనిషిలా తేలికగా ఉండటం చాతనైతే బాగుండును

*23 ఫిబ్రవరి 2011*

# తక్షణం చేయాలి

తక్షణం చేయాల్సినవిగా చాలా కనిపిస్తాయి

పూవులు కనిపిస్తే తెంచాలి
కొలనులోని అలల్ని చేతులతో సరిచేయాలి
అగ్నిజ్వాలలు పిలిస్తే అమాంతం హత్తుకోవాలి
మొత్తం జీవితాన్ని ఒక్క నిమిషంలో బ్రతకాలి

నిజానికి తక్షణం చేయాల్సినవి కొన్ని ఉంటాయి

ఎదురైన ప్రతివారినీ నవ్వుగా వికసించి పలకరించాలి
ప్రతివస్తువునీ చూపులతో తాకినంత మృదువుగా తాకాలి
తీసుకొనే ఆహారంతో రుచులలోకం సంచరించాలి
హృదయంనుండి చూస్తున్నంత ఆర్ద్రతగా జీవితాన్ని చూడాలి

క్షణం లోతుల్లోకి నిట్టనిలువుగా ఈక్షణమే ప్రవేశించాలి
క్షణంలో నిలబడి జీవితాన్ని క్షణంలా గడిపివెళ్ళాలి

కంగారు మనుషుల్లా
తక్షణం పూర్తి చేయమని చాలా పనులు పిలుస్తున్నపుడు
నింద్రైన మనుషుల్లా
నిజంగా తక్షణం చేయాల్సినవి ప్రక్కన నిలబడి చూస్తాయి

*16* మార్చి *2011*

# వస్తాము

వెళుతూ, వెళుతూ పేరు తెలియని ఊరిలో రైలు దిగినట్టు
ఉండి, ఉండీ కోనేటి నిశ్శబ్దంలో రాయి విసిరినట్టు
దారివెంట చూస్తూ, చూస్తూ ఒక మనిషివైపు నవ్వినట్టు
నిద్రపోతూ, పోతూ కాసేపు రంగులకల కన్నట్టు
ఎక్కడ ఉండే వాళ్ళమో, లేనివాళ్ళమో ఈ లోకంలోకి వస్తాము

ఎలా వచ్చామో తెలీదు, వచ్చి ఏంచేయాలో తెలీదు
ఎప్పుడు చేయిదులుపుకొని లేచి వెళ్ళిపోవాలో తెలీదు

గుంపులు, గుంపులుగా ఉన్న మనలాంటి నమూనాలు
కాలంలో కొట్టుకుపోయే మనలాంటి నీటిబుడగలు
నవ్వుతుంటే నవ్వుతాము. ఏడుస్తుంటే ఏడుస్తాము
భయపడుతుంటే భయపడతాము. నటిస్తుంటే నటిస్తాము

సున్నాలో ఇరుక్కున్న ఆకాశంలా
మనలో ఏమీ ఉండదు. ఎవరిలోనూ ఏమీ ఉండదు

అకస్మాత్తుగా గార్డు ఈల వినిపిస్తుంది. రైలు కూత పెడుతుంది
నిద్దట్లోని కల ఉలిక్కిపడి మాయమౌతుంది

తరువాత ఏమౌతుందో ముందే తెలుసుకొందామని ఎందరికనిపిస్తుంది
తరువాత మనమే కాదు, సృష్టి కూడా మిగలదేమో ఊహించే ధైర్యం ఎందరికుంటుంది

*30 జనవరి 2011*

# కలుసుకోవాలి

అతనూ, ఆమే కలుసుకోవాలి
బలశాలీ, బలహీనుడు కలుసుకోవాలి
పండితుడూ, పామరుడూ కలుసుకోవాలి
పేదా, ధనికుడూ కలుసుకోవాలి

అతనూ, ఆమే చెరిగిపోవాలి
వ్యతిరేక వాస్తవాలు చెదిరిపోవాలి
అప్పుడు మనిషీ, మనిషీ మిగలాలి
మనుషులు మాత్రం మిగలాలి
భిన్నధృవాలనుండి మనుషులుగా ఎదగాలి

మనుషులూ, మిగతా జీవులూ కలుసుకోవాలి
మనిషి తనను తుడిచేసుకోవాలి
రెండు జీవులు మాత్రం స్పందించాలి

జీవులూ, ప్రకృతీ కలుసుకోవాలి
జీవి తనని ప్రకృతికి అర్పించుకోవాలి
ఏకైక జీవితం అంతటా విశ్రమించాలి

జీవితమూ, మృత్యువూ కలుసుకోవాలి
జీవితం తనను మృత్యువంత తేలికచేసుకోవాలి
జీవన్మరణాలు చెరిగి తాను మాత్రం మిగలాలి

*22 మార్చి 2011*

# చివర చూసినవాడు

ఆనందిస్తే ఆకాశం పట్టనట్లు ఆనందించాలి
రోదిస్తే ప్రతి అణువూ కరిగిపోయేటట్లు రోదించాలి

ఏది చేసినా పూర్తిగా చేయాలి
ఏదో ఒకటే చేయాలి
ఇంక ఏమీ మిగలనట్టు చేయాలి

సున్నితంగా ఉంటే ఆకాశం తాకినా చలించిపోవాలి
కఠినంగా ఉంటే అణువైనా చొరబడలేనంత కఠినం కావాలి

తానే ఉన్నాననుకొంటే ఆకాశమైనా అవసరం లేనట్లుండాలి
తలవంచితే ప్రతి అణువుకీ ప్రార్ధనగా నమస్కరించాలి

ఏది చేసినా చివరికంటా చేయాలి
తల్లివేరు మొదటికైనా, చిటారుకొమ్మ కైనా చేరుకోవాలి
ఊహిస్తే ఆకాశం అంతా ఊహించాలి, చూస్తే అణువువరకూ చూడాలి

తర్కమైనా, నమ్మకమైనా వాటి చివర చూడాలి
ఒక చివర చూస్తే చాలు, రెండవ చివర వద్దన్నా తెలుస్తుంది
సృష్టి వలయాన్ని దాటినవాడికి విలయ సౌందర్యం స్ఫురిస్తుంది

చివర చూసినవాడు మాత్రమే ప్రపంచరహస్యాల ముడి విప్పగలడు
చావుపుట్టుకలను బొమ్మలుచేసి ఆడుకోగలడు
అతను రావాలనుకొంటే వస్తాడు, వెళ్ళాలనుకొంటే వెళతాడు

మనకన్నీ కావాలి. సగాలూ, పాతికలూ, విరిగినవీ, పగిలినవీ
మనకైనా అర్ధంకాని మన కొలతల మేరకి
మసకచీకటిలో దాగినట్టు వీటన్నిటి వెనుకా మనల్ని దాచుకొంటాం

మన కొలతలకి అందనిది ఏదో
మనల్ని కావాలంటే ఇక్కడికి విసిరేస్తుంది, వద్దనుకొంటే వెనక్కు లాగేస్తుంది

*30 డిసెంబరు 2010*

# వెన్నెలలోకం

కొందరుంటారు, చీకటిలో కళ్ళుమూసుకొని నడుస్తుంటారు
దయతలచి వారిముందు ఎన్నిదీపాలు వెలిగించినా చీకటినే చూస్తుంటారు
కళ్ళు తెరిచి చూడమంటే, కళ్ళంటే ఏమిటి, తెరవటమంటే ఏమిటంటారు
వెలుతురొకటుందంటే వెర్రిమాటంటారు

మరికొందరుంటారు, నీడల్ని వెదుకుతూ తలదాచుకొంటారు
చీకటి భద్రతా, వెలుతురు స్పష్టతా కావాలంటారు
వెలుతురు వెచ్చదనం చీకటి చల్లదనం రెండూ అవసరమేనంటారు
వారి కళ్ళని వెలుతురు ఆకర్షిస్తుంటే
వారి పాదాలని అస్తిత్వమేలేని చీకటి బంధించిందంటారు

ఎక్కడో ఒకరుంటారు, ఎండల్లో పడి నడిచివెళ్ళిపోతారు
వెనుతిరిగి మనవంక చూసి మీరు ఎండమావుల్ని త్రాగుతున్నారంటారు
నేనున్నది ఎండలాంటి వెన్నెల, రండి అందరం ఆడుకొందామంటారు

పక్వమైన ఫలాల్లాంటి కొందరికి వారిమాటలు అర్థమౌతాయి
ఒక గాలితెర తాకితే చాలు పండు రాలినట్టు
ఒక మౌనంలాంటి మాట తాకితే చాలు, వారు వెన్నెలలోకంలోకి దూకేస్తారు

*26 ఫిబ్రవరి 2011*

# అతను

అతని కోసం బయలుదేరే వారికి అతనెలా ఉంటాడో తెలియదు
అతన్ని చూసినవారైనా ఎలా ఉండడో చెబుతారు కాని అతన్ని చెప్పలేరు
లోకం గురించి తెలియకపోయినా బ్రతకటానికి సిద్ధమౌతున్న గర్భస్థశిశువులా
కొందరతనిని వెదికేందుకు బయలుదేరతారు

వెళ్ళే కొద్దీ సూదిమొనలా పదునైన, ఇరుకైన దారివెంట
తమతో తెచ్చుకొన్నవన్నీ ఒక్కొక్కటీ విడిచిపెడుతూ
చివరికంటా నడిచి వెళ్ళి స్పృహ తప్పుతారు

అప్పుడు నిర్మలాకాశంలాంటి అద్దంలా అతను కనిపిస్తాడు
అతనిలోకి చూసుకొన్నపుడు ఆశ్చర్యం కలుగుతుంది
ఏ రూపమూ లేని ఉత్త చిరునవ్వులా అతను వారికి కనిపిస్తాడు

అతనికీ, వారికీ మధ్య నిద్రకీ, మెలకువకీ ఉన్నంత దూరమైనా లేదని
అతన్ని చేరేందుకు
ఊహలోంచి ప్రపంచంలోకి వచ్చే సమయమైనా ఎక్కువని తెలుస్తుంది
అప్పుడు వారు ఊహల సరిహద్దుల అవతల ఉన్న అతనిలోకి ప్రవేశిస్తారు,
అతనుగా కరిగిపోతారు

*30 జనవరి 2011*

# ఒక్క ఊహైనా

అప్పుడు ఒక్క ఊహైనా పూవులా రాలదు
ఒక్క ఊహైనా సీతాకోకలా ఎగరదు
నిద్రలో పాపాయి నవ్వులా వెలగదు
కదలని కోనేటిలో చందమామలా ప్రతిఫలించదు

ఊహలన్నీ మంచులా కరిగిపోయాక
ఊహలన్నీ తెరలలా తొలగిపోయాక, మోహంలా ఆవిరయిపోయాక
ఊహలన్నీ మరీచికలై, పిట్టలగుంపులా ఎగిరిపోయాక
పిల్లచేపలగుంపులా తటాలున మాయమయ్యాక

ఊహలైనా తాకలేని ఆనందంలా, ఆనందంలాంటి ఆనందంలా
ఊహనైనా దాచలేని ఆకాశంలా, ఆకాశంమినహా ఏమీలేని ఆకాశంలా
ఊహనైనా మోయలేని పసిమనస్సులా ఉండిపోతాము
అప్పుడు మనలోని మహారహస్యం మహాశ్చర్యంగా పక్వమౌతుంది

*30 జనవరి 2011*

# రహస్యం

సముద్రంలో ఈదే చేపకి సముద్రం రహస్యం
ఆకాశంలో తేలే సమస్తానికీ ఆకాశం రహస్యం
కాలంలో కదిలే ప్రపంచానికి కాలం రహస్యం
జీవంతో స్పందించే ప్రాణికి జీవితం రహస్యం
మెలకువలో అన్నీ తెలిసే మనిషికి మెలకువ రహస్యం

రహస్యంగా ఉండటంలో అందముంది
రహస్యాన్ని వెదకటంలో ఆకర్షణ వుంది
ఎవరి దాగుడుమూతలాటలో వారికి ఆనందం వుంది

నిజంగా ఆట ఇక చాలు అనిపించినపుడు
ఆటచాలని మినహా మరేమీ అనిపించనపుడు
చాలినంత నిద్రపోయాక నిద్ర విడిపోయినట్లు రహస్యం విడిపోతుంది
అప్పుడు అండంలోని పక్షికి వెలిగేలోకం, ఎగిరేలోకం ఉన్నచోటనే కనిపిస్తుంది

*28 జనవరి 2011*

# అది ఉంటుంది

వికసించే పుష్పంమీద వేయి కవితలు రాయవచ్చు
వేయి భావాలు పూవు చుట్టూ సీతాకోకలై ఎగరవచ్చు
అయినా పూవు పూవులాగానే ఉండిపోతుంది

అర్ధరాత్రి చంద్రుని చుట్టూ అనేక ధ్యానాలు సృజించవచ్చు
అనేక ప్రార్ధనల వెన్నెలలు చంద్రునికి అర్పించవచ్చు
అయినా చంద్రుడు చంద్రునిలాగే ఉండిపోతాడు

ఏది ఉందో అది ఉంటుంది
ఎప్పటికీ అంతంలేని కాలంలాగానే
ఎప్పటికీ కనిపించని కాంతిలాగానే
ఎప్పటికీ చేతికి తగలని జీవితంలాగానే

*12 ఫిబ్రవరి 2011*

# రెండు నదులు

అస్తమయ ఉదయాల ఒడ్డుల్ని ఒరుసుకొని
ఒక చీకటి నది ప్రవహిస్తుంది
ఉదయాస్తమయాల ఒడ్డుల్ని ఒరుసుకొని
ఒక వెలుతురు నది ప్రవహిస్తుంది
వెలుతురూ చీకటీ రెండు నదులా
ఒక నదిని తిరగేస్తే రెండవది అవుతుందా
రెండింటినీ ప్రవహింపచేస్తున్న ఆకాశాన్ని అడగాలి

రెండు తటస్త సమయాల ఒడ్డుల్ని ఒరుసుకొని
ఒక దు:ఖం నిండారా ప్రవహిస్తుంది
మరి రెండు తటస్త సమయాల ఒడ్డుల్ని ఒరుసుకొని
ఒక ఆనందం పొర్లిపోతూ ప్రవహిస్తుంది
దు:ఖమూ ఆనందమూ రెండు నదులా
ఒక నదిని తిరగేస్తే రెండవది అవుతుందా
రెండింటినీ ప్రవహింపచేస్తున్న స్వచ్ఛమైన మనస్సుని అడగాలి

రెండు మగత అనుభవాల ఒడ్డుల్ని ఒరుసుకొని
ఒక నిద్ర నది ప్రవహిస్తుంది
మరి రెండు మగత అనుభవాల ఒడ్డుల్ని ఒరుసుకొని
ఒక మెలకువ నది ప్రవహిస్తుంది
నిద్రా మెలకువా రెండు నదులా
ఒక నదిని తిరగేస్తే రెండవది అవుతుందా
రెండింటినీ ప్రవహింపచేస్తున్న అస్తిత్వాన్ని అడగాలి

*24 ఫిబ్రవరి 2011*

# ఐదు శక్తుల ఆట

కదలని ఆకాశంలో కదలిక ప్రాణం పోసుకొని వాయువయింది
ఆకాశానికి వాయువు ఒరుసుకొని అగ్ని వెలిగింది
అగ్ని చల్లబడి నీరయింది, నీరు ఘనీభవించి నేలయింది

మన పూర్వులు చెప్పిన ఈ కథ తలచుకొన్నపుడల్లా
తెలియని సంతోషం వలయాలుగా కమ్ముకొంటుంది

ఆకాశమే శబ్దమై మన చెవుల ద్వారా తనని వింటుంది
వాయువే స్పర్శలా మారి మన చర్మం ద్వారా తనని తాకుతోంది
అగ్ని దృశ్యంలా విస్తరించి మన కనుల ద్వారా తనని చూసుకొంటోంది
జలమే రసరూపం దాల్చి మన నాలుక ద్వారా తనని రుచిచూస్తోంది
భూమి పరిమళంగా పక్వమౌతూ మన నాసిక ద్వారా తనని ఆఘ్రాణిస్తోంది

మన పూర్వులు విప్పిన ఈ రహస్యం తలచుకొన్నపుడల్లా
ఎక్కడినుండో తేలికదనం వ్యక్తమౌతోంది, విస్తరిస్తోంది

ఐదు మహాశక్తులూ వాటి ఆట అవి ఆడుకొంటే మనం చేయవలసిందేమిటి
చేయవలసింది తెలియకపోయినా, చేయకూడనివి చాలా కనిపిస్తున్నాయి
వాటి ఆటకు మనం ఆటంకం కాకపోతే చాలు
పిల్లల ఆటల్ని చూసి ఆనందించినట్లు, ఆనందిస్తే చాలు

అయితే కదలని ఆకాశానికి ముందు ఏముంది
ఆకాశం ఉండటానికి ముందు ఉన్నది ఏమిటి
ఈ ప్రశ్న తలచుకొన్నపుడల్లా ఆకాశమంత గాఢమైన నిశ్శబ్దం మేలుకొంటుంది
చిరంతన నిశ్శబ్దంలో విశ్వం సుదూర నక్షత్రంలా ఎక్కడికో ప్రయాణిస్తూ కనిపిస్తుంది

*19 మార్చి 2011*

# చిక్కుముడి

చాలా సంవత్సరాలుగా చూస్తున్నాను
ముఖాలలో అవే మెరుపులు, మసకచీకట్లు
వేటినో దాచుకొంటున్న భయాలు, వేటినో పోగొట్టుకొన్న దిగుళ్ళు
వెలితిపడటం.. మొరటుకావటం..
యుగాలనాటివి తాజాగా పునరావృతం అవుతూ..
నాలోనూ.. నా పరిసరాలలోనూ..

మరొకసారి చెట్లమీది సూర్యకాంతి క్రమంగా మాయమైంది
మరొకసారి పొదవాటి నీడలు చీకటిలోకి కరిగిపోయాయి
మరొకసారి నా తలపైన నిశ్శబ్దంగా చంద్రుడూ, నక్షత్రాలూ మేలుకొన్నాయి
మరొకసారి చివరిపిట్టలు నన్ను నా కలలకి వదలి గూళ్ళకి చేరుకొంటున్నాయి

ఈ సాయంత్రం నన్ను ఎప్పుడూ ఆకర్షించే చిక్కుముడిని చూస్తున్నాను
వీటన్నిటిలోంచీ కాలం ప్రవహిస్తుందా
ఈ క్షణంలా నిలకడగా ఉన్న కాలంలోంచి ఇవి అన్నీ ప్రవహిస్తున్నాయా

రెండవప్రశ్న తరువాత ఎప్పటిలాగే ఏమీ మాట్లాడాలనిపించలేదు

*22* ఆగస్టు *2006*

# నడుస్తూ ఉంటాము

కాలంలేని లోకంనుండి కాలంలోకి జారి
ఎక్కడికో తెలియకనే నడుస్తూ ఉంటాము

కొత్తకాగితాలవంటి మెలకువలు
సాయంత్రానికి మరకలు పడి నలిగిపోతాయి
నలిగిపోయిన మెలకువల దొంతరలు దాచుకొని
ఉత్సాహంగానో, విసుక్కొంటూనో నడుస్తూ ఉంటాము

కంటిముందు దృశ్యాలు మన వెనుక ఆవిరవుతుంటాయి
నిశ్శబ్దంలో బుడగల్లా లేచిన మాటలు అంతలో చిట్లిపోతాయి
జీవితానుభవం అందినట్లే అంది జారిపోతుంది
అనుభవం వెనకాల పరుగుపెడుతూ నడుస్తూ ఉంటాము

ఏవో పొందినట్లుంటుంది
పొందటం వెనకాల దేనినో పోగొట్టుకొన్నట్లుంటుంది
ఎప్పుడూ ఏదో మరిచిపోయినట్లుంటుంది

వెదకవలసినదేదో తెలియకుండానే వెదుకుతూ
తెలిసిందంటూనే, తెలియలేదనుకొంటూనే నడుస్తూ ఉంటాము

మనతో ఆకాశం నడుస్తుంది. గాలి నడుస్తుంది
నిప్పూ, నీరూ, నేలా మనతో నడుస్తాయి
మనతో కలలు నడుస్తాయి, కథలు నడుస్తాయి

నడుస్తూ, నడుస్తూ కాలంలేనిచోట ఆగిపోతాము
చేతులలో శూన్యంతో, కళ్ళలో చీకటితో ఆరిపోతాము

తాను నడుస్తుందో లేదో తెలియకుండా
తెరమీది బొమ్మలా అణువైనా జరగకుండా కాలం గడుస్తూ ఉంటుంది

*10 ఫిబ్రవరి 2011*

# గోడ

మనం గోడను చూస్తున్నపుడు గోడవెనుక ఏముందో చూడగలగాలి
గోడ వెనుకవైపు కాదు, గోడ ఉండడం వెనుక.

వేలలో ఒకరికి ఈమాట అర్థమౌతుంది
వేలలో ఒకరికి స్వచ్ఛత రహస్య జీవితాదర్శమౌతుంది
వారికి ఈమాట తెలుస్తుంది

ప్రపంచం ఒక గోడ
దానిని కూల్చాలనుకొన్నవారు, దానికి బలాన్నిస్తారు
అది లేనేలేదని తెలిసినవారు, దానిలోంచి నడిచివెళ్ళిపోతారు

లేకుండా ఉండగలిగే స్వచ్ఛత ఉన్నవారికి
ప్రపంచం ఉన్నట్లు కనిపించే లేనిదని తెలుస్తుంది
వారు ప్రపంచంలో వుంటూ, ప్రపంచం ఉండటాన్ని దాటివుంటారు

మన దేహాలని పగలు తాకుతుంది. రాత్రి తాకుతుంది
అవి వాటి నీడలు మన లోపల రాల్చి వెళతాయి

వేలలో ఒకరు పగటినీ, రాత్రినీ దాటి వెళతారు
వారు నీడలు రాలని కాంతిలో ఉంటారు

అక్కడ వారు ఉండరు. ప్రపంచం ఉండదు
కేవలం కాంతి ఉంటుంది. కాంతి ఉండటమే ఉంటుంది

*5 జనవరి 2011*

# నీడలేని కాంతి

కిటికీరెక్కలు మూసి పలుచని చీకటిని గదిలోకి ఆహ్వానించాను
శరీరానికి మంచంపైన విశ్రాంతి నిచ్చి, నెమ్మదిగా కనులుమూసి
మృదువుగా నన్ను చెరిపివేయటానికి ప్రయత్నిస్తున్నాను

ఫాను గాలి వలయాలని చప్పుడు చేస్తుంది
కేలండరు తీగ గోడతో ఆడుకొంటోంది
బయట వాహనమేదో హారను శబ్దాన్ని తీసుకెళుతుంది
ఏవో పిట్టలు ఉండి ఉండి తమ కూతల్ని గుర్తుచేసుకొంటున్నాయి

ఈ శబ్దాలు వాటి వెనుకనుండో, లోపలినుండో
నా పలుచని చీకటి గదిలోకీ, చెరిపివేసుకొంటున్న నాలోకీ
మెల్లగా ఏవో కాంతిని ఒంపుతున్నాయి

కాంతి అతి మృదువుగా స్థలం సరిహద్దుల్ని చెరిపివేస్తోంది
ఇంతకాలమూ స్థలంలో నేను ఉన్నాననుకొన్నాను
ఇపుడు స్థలమే నాలో ఉన్నట్లు కనిపిస్తోంది

ఈ స్థలం పవిత్రంగా వుంది. ఆశ్చర్యంగా వుంది
నీడలే లేని కాంతివలే వుంది

*29 ఆగష్టు 2006*

# దారికాని దారి

అవుననటం ఒక దారి, కాదనటం ఒక దారి
ఇవ్వటమొక దారి, తీసుకోవటమొక దారి
విజయం ఒక దారి, పరాజయం ఒక దారి

ప్రతిసారీ రెండు దారులు ఎదురవుతాయి
ప్రతిసారీ రెండుదారుల మధ్య నిలబడి చూస్తాము
రెండుదారులూ ఎప్పుడూ రెండుసగాలుగా కనిపిస్తాయి
ఏ దారి వెళ్ళినా ఇరుకుసందుల్లో వచ్చినదారి మరచిపోతాము

చాలాసార్లు దారికాని దారి ఒకటి మనకోసం ఉంటుంది
నిశ్శేషంగా మనల్ని ఒంపుకొంటూ వెళ్ళే దారి ఉంటుంది
మనం కానివి విడిచిపెడితే తేలికపడే దారి ఉంటుంది

వదిలేస్తే, వదులైతే శ్వాసలో కొత్తగాలి చేరుతుంది
ఖాళీ చేసిన గదిలో ఆకాశంలా ఆనందం నిండుతుంది
లోపలికంటా విశ్రాంతి ఉంటే వెలుపలిదంతా తెలుస్తుంది

నడిచి చూడాలనిపించే దారి మనకోసం ఎదురుచూస్తుంది
మన లోలోపలి పొరలనుండి స్ఫురిస్తూ ఉంటుంది
నడవాలనుకొంటే చాలు మనబదులు తానే నడిచేందుకు సిద్ధంగా ఉంటుంది

*26 జనవరి 2011*

# మొదటి ప్రశ్నలు

పనిలో ఉన్నపుడు నువ్వు ఏమిటి అన్నది రెండవ ప్రశ్న
నీ విరామసమయాలలో నువ్వు ఏమిటి అన్నది మొదటి ప్రశ్న

పదుగురిలో ఉన్నపుడు నువ్వు ఎవరు అన్నది రెండవది
నీతో నువ్వుండే ఏకాంతంలో నువ్వు ఎవరు అన్నది మొదటిది

రెండవప్రశ్నలు ప్రపంచానికి చెందినవి
నువు వెళ్ళిన మరునిమిషం నిన్ను మరిచిపోయేందుకు ఇష్టపడే ప్రపంచానికి

మొదటిప్రశ్నలు నీకు చెందినవి
నీనుండి ప్రపంచం తొలగిన మరునిమిషం నిన్ను దగ్గరకు తీసుకొనే నీకు

మొదటిప్రశ్నలు పవిత్రమైనవి
నీ జీవనబీజం మొలకెత్తే క్షేత్రానికి చెందినవి

*18 డిసెంబరు 2008*

# లోతైన నిజాయితీ

పూవులు, రంగులు, ప్రేమలు
వెన్నెల, చలిగాలులు, వానజల్లులు
ఒకసారి నాలో నక్షత్రాల స్వచ్ఛమైన కాంతిని పరిచాయి
మరొకసారి మెరిసే వజ్రాలపొడిలా నన్ను గాయపరిచాయి

సున్నితమైన ఆనందాలని చూపించి
లోతైన బాధలని మూల్యంగా స్వీకరించింది జీవితం
మరింత గాఢమైన అనుభవాలలోకి తప్పించుకోవాలని చూసినపుడు
అస్తిత్వమే కదిలిపోయే వేదనని పరిహారంగా కోరింది

బలమైన దు:ఖాన్ని మొనతేలిన కన్నీటిసుడిలా నాటి
జీవితం తనని విడిచిపొమ్మని కోరింది

దు:ఖానికి తలవంచి మరణించబోతూ వుండగా
నాలో ఎక్కడో లీలగా నిజాయితీ లోపించటం గమనించాను

లోతైన దు:ఖంనుండి బయటపడటానికి
మరింత లోతైన నిజాయితీ మార్గమని తెలుసుకొని
నన్ను నేను స్పష్టంగా దర్శించాను

నిజాయితీ వెలుగులో నన్ను మొదటిసారి చూసినపుడు
ఒక్కసారిగా ఆశ్చర్యం కలిగింది
నేను ఏనాడూ జన్మించలేదని, మరణించలేనని తెలుసుకొన్నాను

ఇన్నాళ్ళూ నేను జీవితమనుకొన్నది ఒక నీడ అని, దుఃఖక్రీడ అని
జీవితం నాకు ఆనందం, దుఃఖం కాదని
జీవితానికి నేనే అందమని, ఆనందమని తెలుసుకొని

జీవితం పరిచిన స్థలకాలపు ఇంద్రజాలంలోంచి
చలించని ఆనందమై ప్రకాశిస్తున్నాను

*8* సెప్టెంబరు *2006*

# నేను ఉన్నాను

నేను హృదయాన్ని. నేను అందరి ఒకే హృదయాన్ని
ఒక శరీరంలోంచి మాట్లాడుతున్నా నేనే అందరి శరీరాన్ని

సృష్టి నా కవిత్వం, నా గానం
అనేకంగా వ్యక్తమౌతూ అన్నిటి ధ్వనిలా, సౌందర్యంలా నేనున్నాను
అనేక స్వరాలుగా వికసిస్తూ అన్నిటి శృతిలా, నాదంలా నేనున్నాను

సృష్టి నా ఆట, నా ఉత్సవం
నా ఆట వెనుక స్వచ్ఛమైన పసితనం నేనై ఉన్నాను
నేనే నా ఆటని ఆశ్చర్యపోతూ చూస్తున్నాను
క్షణం సృష్టిస్తూ, క్షణం చెరిపేస్తూ ఉత్సవచైతన్యం నేనై ఉన్నాను

సృష్టి నేనై ఉన్నాను. ఏకకాలంలో అనేకమై, ఒక్కటై ఉన్నాను
నాలో ప్రతి ఒకటీ తనకు తానై ఉంది. తానే సమస్తమై ఉంది

నేను హృదయాన్ని. అందరి ఒకే హృదయాన్ని
నేను నేనుగా ఉన్నప్పుడు నేనే పరిపూర్ణ ప్రేమని. కారుణ్యాన్ని
పరిపూర్ణ సంతోషాన్ని, సుఖాన్ని, సంతృప్తిని
నేను నాలోనే ఉన్నప్పుడు అపరిమితమైన స్వేచ్ఛని, సౌందర్యాన్ని, శక్తిని

జీవులు వేదనలో ఉన్నప్పుడు వారిలో శాంతినై ఓదార్చుతున్నాను
వారు భ్రమలలో మునిగినప్పుడు పరమ కారుణ్యాన్నై ఎదురుచూస్తున్నాను

నేను సదా నిశ్చలంగా ఉన్నాను. నిర్మలంగా ఉన్నాను
క్షణక్షణమూ మారే సృష్టిలా అతి సున్నితంగా ఉన్నాను
ఏ శక్తీ అణుమాత్రమూ ఛేదింపలేని ఆధారమై కఠినంగా ఉన్నాను
ఏకకాలంలో నేను ఉన్నానుగా ఉన్నాను, లేనుగా ఉన్నాను

*27 జులై 2006*

# జీవితం దైవం

దైవం అతీతశక్తి మాత్రమే అని,
కావలసినవి ఇస్తుంది, కానివాటికి దండిస్తుందనేవారూ
దైవం లేనేలేదని, ప్రపంచం పరమావధి అని బ్రతికేవారూ
ఒకే పొరపాటు రెండువైపులనుండి చేస్తున్నారు

దైవం అతీతశక్తి మాత్రమే కాదు,
ఉన్నదంతా దైవమే, జీవితమే దైవం

జీవితం దైవమని భావించాలి
జీవనశక్తుల్ని దైవీసంపదగా గ్రహించాలి
పదమేదైతే ఏమిటి పవిత్రభావన కావాలి
వస్తువేదైతే ఏమిటి మన భావంతో పవిత్రం చెయ్యాలి

పవిత్రభావన అనుభవాల్ని పవిత్రం చేస్తుంది, శుభ్రం చేస్తుంది
స్వచ్ఛమైన మనస్సులో జీవితానుభవం విస్తరిస్తుంది

జీవితం దైవం ఒకటే
జీవితంలోని ఊహలు విడిచి జీవితాన్ని ఊహించాలి
జీవితంలోని అనుభవాలు విడిచి జీవితాన్ని అనుభవించాలి

ఊహ ఏదైతే ఏమిటి ఊహాలోకం విస్తరించాలి
తనలోనే తానొక మూల ఒదిగి బ్రతకటం మాని
తన ఆకాశం నిండా తానే వ్యాపించాలి
తాను ఉన్న ప్రపంచంనిండా తననే దర్శించాలి

అప్పుడు అందరిలో మనకు దైవం కనిపిస్తుంది
మనలో అందరికీ దైవం కనిపిస్తుంది

*10 మార్చి 2011*

# మతం

మతమంటే ఏమిటంటే కవి ఇలా చెప్పాడు
మతమంటే మనిషి ఎదగటం, జీవనసారం వెదకటం
మనం బయలుదేరిన చోటు తెలుసుకొని ఎప్పటికీ అక్కడ ఉండిపోవటం

మతంలో మూడు దారులుంటాయి

తెలియనివారి దారి
వారికి అన్నీ తెలుసనిపిస్తుంది
తమకి తెలిసిందే చివరిదనిపిస్తుంది

తెలిసీతెలియనివారి దారి
వారు ఎవరి వలయంలో వారు తిరుగుతుంటారు
వారిలో ఆకాశంలా నిలిచే ఓర్పూ, చూసే శ్రద్ధా కలవారు
ఒకనాటికి తెలిసినవారవుతారు

తెలిసినవారి దారి
వారికి తమకేమీ తెలియదనిపిస్తుంది
ఏదైనా మొదటిసారే తెలుస్తున్నట్లనిపిస్తుంది

ప్రపంచంలో పసితనం తప్పిపోయినవారు తెలియనివారు

పసితనం తప్పిపోయిందని బెంగపడి వెదికేవారు తెలిసీతెలియనివారు

పసితనంలో ప్రపంచం తప్పిపోయినవారు తెలిసినవారు

*3 ఫిబ్రవరి 2011*

# మాటలు

మాటలు మనతో నడుస్తూ ఉంటాయి
కొన్ని తాబేళ్ళలా నింపాదిగా తొందరేమిటంటాయి
కొన్ని కుందేళ్ళలా గంతులేస్తూ ఆలస్యమెందుకంటాయి

కొన్ని మన ప్రక్కన పక్షులలా ఎగురుతాయి
కొన్ని మన చేతిలోని దీపంలా దారి చూపిస్తాయి

కొన్ని సీతాకోకల్లా మనమున్నా లేనట్లే మనముందే అటూఇటూ తిరుగుతాయి
కొన్ని మన నీడల్ని మనకంటే పొడవుగా మన ముందు పరుస్తాయి
కొన్ని మాటలు తోటలోని పూలలా పలకరించి తప్పుకొంటాయి

అన్ని మాటలూ ఒకలాగానే మనతో నడుస్తూ ఉన్నట్లుంటాయి
కొన్ని మనతో ఒక్క అడుగువేసి మాయమవుతాయి
కొన్ని మన చేయి పట్టుకొని, మనకు చేయందించి నడుస్తాయి

కొంచెం ముందూ, కొంచెం వెనుకా నడిచే మాటలన్నీ
మనకు తెలియని వెచ్చదనాన్నిస్తూ ఉంటాయి

అరుదుగా కొన్ని మాటలుంటాయి
ఎప్పుడూ ఉండే గాలిలా, ఆకాశంలా సరళంగా ఉంటాయి

మనకు ఒకవైపు దూరరేఖమీద తేలుతున్న సూర్యబింబంలా
మరోవైపు నీలాకాశాన్ని దీవిస్తున్న ఇంద్రధనువులా
మన ప్రక్కన ఉన్నట్లే ఉండి మనకు అందకుండా ఉంటాయి
మనతో నడుస్తున్నట్లే ఉండి అనంతగమ్యాలని చేరి ఉంటాయి

*17 ఫిబ్రవరి 2011*

# చదవటం

చాలామంది విస్తృతంగా చదువుతారు
చీకటిలో నడవనా వద్దా అనుకొంటూ నడిచినట్లు
నీటిలో మునగకుండా తేలికగా ఈదినట్లు పైపైన చదువుతారు
యుగాలు జీవించే శిలలాగా పైపైన బ్రతుకుతున్నట్టు చదువుతారు

కొందరికి చదివిన కొద్దీ ఏవో కొత్త దారులు, కొత్త లోకాలు కనిపిస్తాయి
సరదాగా బ్రతుకుతున్నట్టు సరదాగా చదువుకోవటం ఒక ఆట
ఆడటం బావుంటుంది. దాని సౌందర్యం దానికుంటుంది

అరుదుగా వారిలో కొందరికి
చాలాకాలం చాలా లోకాలు తిరిగిన తరువాత
చందమామ కథల్లో రాకుమారుడి వెనకాల చాలాసార్లు నడిచిన తరువాత
ఇంతేనా ఇంకేమైనా ఉందా అనే ప్రశ్న ఎక్కడినుండో మర్రివిత్తనంలా వాలుతుంది

ఇక చదవటం ఆపి తనలో మేలుకొన్న లోకాలన్నిటిలో తిరిగివస్తారు
ఇంతేనా ఇంకేమైనా ఉందా అనే ప్రశ్న మొలకెత్తటం ప్రారంభిస్తుంది

అప్పుడు వారు లోతుగా చదవటం మొదలుపెడతారు
ఇన్ని లోకాలు ఎక్కడున్నాయో వెదకటం మొదలుపెడతారు
ఇన్ని లోకాలని పొదువుకొన్న ఊహ అనే లోకాన్ని తేరిపార చూస్తారు
ఇన్ని లోకాలని కలగంటున్న జీవనస్వప్నాన్ని పరిశీలిస్తారు
భూగర్భంలోకీ, జలగర్భంలోకీ వెళ్ళినట్టు జీవితగర్భంలోకి ప్రవేశిస్తారు

అప్పుడిక వారు ఏ లోతుల్నీ చదవరు, ఏ లోకాల్నీ చూడరు
వారు లోతులో ఉంటారు. వారే ప్రపంచమై ఉంటారు
అప్పటినుండి వారికన్నీ తెలుస్తాయి. స్ఫురిస్తాయి. వారితో కలిసి జీవిస్తాయి

*18 ఫిబ్రవరి 2011*

## ఊహ

అద్దంలో కనిపించే ప్రతిబింబంలాంటి ఊహని
తాకలేని కాంతిలాంటి, తాకలేని చీకటిలాంటి ఊహని
కనులు విప్పగానే సీతాకోకలా ఎగిరిపోయే కలలాంటి ఊహని

తేలికగా వుందనీ, ఊరికే వచ్చిందనీ
స్వేచ్ఛలా వుంటుందనీ, ఎవరూ చూడరనీ
ఊరికే గాలిపటంలా ఎగరేస్తాం కాని

ఊహతో జాగ్రత్తగా ఉండాలి
అది మనిషిని దైవాన్ని చేస్తుంది, దయనీయుడినీ చేస్తుంది
మనలోపలి లోకంలో ఊహని దీపంలా వెలిగించినపుడు
చూడవలసినవేవో, కానివేవో తెలిసివుండాలి
ఎటు నడవాలో, ఎలా నడవాలో చాతనైవుండాలి

ఊహ జీవనసారం
ఊహ మన ప్రాణం దాచుకొన్న వజ్రం
ఊహ విత్తనంలో చిత్రించిన వృక్ష నిర్మాణం

శ్రద్ధగా, నెమ్మదిగా ఊహని ఎదగనివ్వాలి. వికసించనివ్వాలి
ఊహ ఏదో, వాస్తవమేదో తెలియనంత
బలమైన ఊహకోసం, శుభ్రమైన ఊహకోసం, విశాలమైన ఊహకోసం
ఎడతెగని దాహంతో, ఓర్పుతో వేచి వుండాలి

*29 జనవరి 2011*

# సున్నితంగా

సున్నితంగా ఉన్నపుడు
సౌందర్యశిఖరంమీద దు:ఖంలోయ అంచుల్లో నడుస్తున్నట్లుంటుంది

ప్రతిదీ వెలిగిపోతూ ఉంటుంది
ప్రతిదీ బాధ పెడుతూ ఉంటుంది

మెరిసేచీకటిలాంటి రహస్యాలేవో ఆకర్షిస్తున్నట్లుంటుంది
వెలుతురులాంటి ఆశ్చర్యంలో మునిగిపోతున్నట్లుంటుంది
అస్తిత్వాన్ని కోల్పోతున్నట్లుంటుంది

దయగలదో, లేదో ఎప్పటికీ తెలియని ప్రపంచంలో
తనలోకి తాను వలయాలు తిరుగుతూ బిగుసుకొనే
వజ్రంలా బ్రతకటానికి సాహసమెందుకు
కాస్తంత భయం చాలు, తనలో వెలితి ఉందన్న భ్రమ చాలు

ఎదుట ఎవరున్నా చేతులు చాస్తున్న పాపలా
ఎవరి లోపలికైనా చూసి నవ్వేస్తున్న పసిపాపలా
మంచులోకీ, వానలోకీ, ఎండలోకీ లేతరేకల్ని చాస్తున్న పూవులా

కోమలంగా, దయగా బ్రతకటానికి సాహసం కావాలి
పుష్పదళాలనుకొని జ్వాలల్ని తాకబోయే
అమాయకత్వంలాంటి సాహసం కావాలి

*30 జనవరి 2011*

# ఆర్ద్రత

దు:ఖమో, కనికరమో కళ్ళలో తడిలేకుండా కవిత్వమెలా రాయటం
పనులో, పలకరింపులో హృదయం ధ్వనించకుండా మనిషెలా కావటం,
బ్రతుకెలా బ్రతకటం

వాన కురిసిన తడిమట్టి మెరుపు కళ్ళలో కదులుతుండాలి
లోలోపలి నీటిజాడల్ని తెలిపే గరిక పచ్చదనంవంటి జీవితేచ్ఛ
మాటల్లో మెదులుతుండాలి

కోపించినా అలలెగిరినట్లు మృదువుగా, తడిగా ఉండాలి. తటాలున శాంతించాలి
ఎవరినైనా ఉడికించినా లోలోపల వెన్నెల చల్లదనం కనబడుతుండాలి
ఏ ఆకర్షణో మన ఉనికిని లాగేస్తున్నా మనని కోల్పోవటంలో ఆర్తి ఉండాలి

కవిత్వమైనా, జీవితమైనా
ఎడతెగని ప్రార్ధనలాంటి ఆర్ద్రతలోకి సమస్తాన్నీ అనువదిస్తున్నట్లుండాలి
నిండైన జీవితమైనా, నిండైన కవిత్వమైనా దయతో తొణికిసలాడుతుండాలి

కుంభవృష్టి తరువాత గదులలో పరుచుకొనే చల్లటి తేమగాలిలా
ఎవరి అనుమతీ లేకుండానే అందరి హృదయాలలోకీ ప్రవేశించాలి
ఎవరి నిర్ణయానికీ చూడకుండానే అందరినీ ఒకటిగా చేయాలి
కనిపించని దయాసముద్రంలో అందరినీ చేపలై ఈదమని శాసించాలి

*20 ఫిబ్రవరి 2011*

# కవిత్వం

నాకు నచ్చిన భావాన్ని నీకు నచ్చిన మాటలలో చెప్పటం కవిత్వం
నీకూ, నాకూ మధ్యనున్న ఖాళీలో శతకోటి భావాలను దర్శించటం కవిత్వం
భావాల పంచరంగుల బొమ్మలతో కాసేపు ఆడుకోవటం కవిత్వం

పంచమహాభూతాలని తోచినట్లు కలిపి, తోచినట్లు విడదీసే ఆటలలో
నిన్ను నువ్వూ, నన్ను నేనూ మరిచిపోవటం కవిత్వం

దాక్కోవటం కవిత్వం, దొరికిపోవటం కవిత్వం
దాక్కొంటూ, దొరికిపోతూ అలసిపోయిన నువ్వూ, నేనులు
ఒకటిగా విశ్రాంతి పొందటం కవిత్వం

బ్రతికిన క్షణం కవిత్వం
క్షణం క్షణం పుడుతూనే వుండటం కవిత్వం
పాతాళంలో నుండి పొరలిపోయే జలంలా
ఎప్పటికీ బ్రతుకుమీద ఉబుకుతున్న ఉత్సాహం కవిత్వం

కదలకుండా కదిలిచూపే నైపుణ్యం కవిత్వం
అక్షరాల తీగెల్లో విద్యుత్తై విభ్రాంతినివ్వటం కవిత్వం
మాట వెళ్ళిపోయాక మన మధ్యన కాంతులీనే మౌనం అది కవిత్వం

*18 జనవరి 2011*

# నా కవిత్వం

మహాసముద్రాలు ఈదమని కవ్విస్తుంటే
పాదమైనా మోపనట్లు నడిచివెళ్ళే మంత్రవిద్య నా కవిత్వం

దృశ్యంనుండి రహస్యంలోకి
ఉద్వేగాలనుండి స్వచ్ఛతలోకి
భయంనుండి స్వేచ్ఛలోకి
శ్రమ తెలియక నడిపించే స్నేహం నా కవిత్వం

నా కవిత్వం పోరాడదు. బ్రతిమాలదు.
తాను కూర్చుని మనని నడవమనదు. మోయమనదు
తవ్వినకొద్దీ పుట్టుకువచ్చే చీకటిగని కళ్ళముందు గుట్టపోసి భయపెట్టదు

నచ్చినట్లు ఎగిరేందుకు క్రొత్త ఆకాశాలని చూపిస్తుంది
మనం ఎన్నుకొన్న రెక్కలకోసం కొంచెం శక్తిని పొట్లం కట్టిస్తుంది
మన లోలోపలి జీవితేచ్ఛలా మన ఉనికి చాలు ఉత్సవమని భరోసానిస్తుంది

స్వచ్ఛమైన మెలకువ నా కవిత్వం. స్వచ్ఛమైన నిదుర నా కవిత్వం
ఆద్యంతాలు తెలియని ఆశ్చర్యంలాంటి జీవితం నా కవిత్వం
జీవించినంత సరదాగా మరణించటం నేర్పే క్రీడ నా కవిత్వం

*21 జనవరి 2011*

# సామాన్యుడు లక్ష్యం

సామాన్యుడు నా లక్ష్యం
లోకంపోకడ తెలియనివాడు
అన్నిటికీ ఉదారంగా స్పందించేవాడు

విజయాలూ, అపజయాలూ పెద్దగా పట్టనివాడు
కొద్దిపాటి సంతోషాన్ని పట్టుకొని నిలబడ్డవాడు

నీది ఈ జాతీ, ప్రాంతం, వర్గమంటే కాబోలని తలచేవాడు
ఉదాత్తమైన మనిషిలా వాటికి ఎడంగా నిలిచేవాడు

కొంచెం జాలీ, కొంచెం నవ్వూ, కొంచెం పాపం, పుణ్యం
చాలా తృప్తీ కలిగిన అంతరంగ సంపన్నుడు
సాధువు, జీవన తపస్వి నా లక్ష్యం

మనలోపల మరుగున పడుతున్న
ఒక బాలుడు, గ్రామీణుడు, పూర్వీకుడు
సామాన్యుడు మాన్యుడు లక్ష్యం నా కవిత్వానికి

*3* మార్చి *2011*

# కవిత్వం పాఠాలు

1

కవిత్వమంటే హృదయ స్పందన
ఈ మాట సరిగా అర్థమైతే చాలు
ఏది కవిత్వం కాదో, ఏది జీవితం కాదో కూడా తెలుస్తుంది

2

కవిత్వానికి హృదయం రథి, కవి సారథి, వస్తువు రథం
ఉద్వేగం అశ్వం, తత్వం మార్గం
శబ్దవైచిత్రీ, తర్కవిన్యాసం, అలంకారాలూ అస్త్రాలు, ధ్వని బ్రహ్మాస్త్రం
రసజ్ఞునిలో అమానవుని తొలగించి, మానవుని రక్షించటం లక్ష్యం

3

తత్వం లేని ఉద్వేగం కళ్ళు మూసుకొని నడుస్తుంది
ఉద్వేగం లేని తత్వం ఊరికే కూర్చుని చూస్తుంది
అన్నిరంగుల్నీ దాచుకొన్న తెలుపులాంటిది ప్రశాంతఉద్వేగం
అనంతజ్ఞానానికి తెరుచుకొన్న ఆశ్చర్యమే తత్వసారం

4

పదాలతో కాదు, భావంతో ఉండాలి
భావంతో కాదు, నీతో నువ్వుండాలి
నీతో నువ్వున్నపుడు నీలో జీవనసారం ఉండాలి
నిర్మలమైన దుఃఖంతో నిండిన జీవితముండాలి
అక్కడ మాట్లాడాలన్న కోరిక పుట్టాలి
అది పదాల వరకూ తోసుకురావాలి

5

ఇవాళ బ్రతకాలి కాని, నిన్నటిలో, రేపటిలో వీలుకాదు
నిలబడినచోట చూడాలి కాని, లేనిచోటును చూడలేము
ఇవాళ్టి తాజా పదాలూ, భావాలూ, శిల్పమూ పట్టుకొని
నిజంగా మనదైన బ్రతుకులో నిలబడి మాట్లాడాలి

6

పక్షిరెక్కలు తగిలిస్తే పక్షి కాలేము, మన ఊహ పక్షిలా రెక్కలు విప్పాలి
పూలరేకుల్లో మునిగితే పూవు కాలేము, మన కల పూవులా వికసించాలి
అక్షరాలు కూర్చితే కవిత్వం కాలేము
కవిగా జీవించటం సాధన చేయాలి, నిజాయితీగా స్పందించే అలవాటుండాలి

7

కవిత్వం రప్పిస్తే కవులం కాలేము
కవిత్వాన్ని తప్పించుకోలేనివారు కవులవుతారు
భావం కవిని అనుసరిస్తే ఉపన్యాసమౌతుంది
కవి భావాన్ని ఆశ్రయిస్తే, ధ్యానిస్తే కవిత్వం వస్తుంది

*4 మార్చి 2011*

# సన్నని రేఖ

కవిత్వం రాస్తున్నపుడు కాదు, రాసేముందు కవి కావాలి
కవిత్వం చదువుతున్నపుడు కాదు, చదివాక అలజడి కలిగించాలి

కవి పదాలతో కాదు, పదాల మధ్య మౌనం నింపి ఆలోచింపచేయాలి
పుస్తకం తెరిచినపుడు కాదు, మూసిన తరువాత వదలని జ్ఞాపకం కావాలి
మనిషి ఉన్నపుడు కాదు, వెళ్ళిపోయాక వీడని పరిమళం కావాలి

కవికీ, సౌందర్యానికీ మధ్య
కవిత్వానికీ, మౌనానికీ మధ్య
మనిషి ఉండటానికీ, వెళ్ళటానికీ మధ్య సన్నని రేఖ ఉంటుంది

అక్కడ నిలబడి బ్రతికేవారిలో అన్నిటికీ స్పందించే జీవం ఉంటుంది
వారికి అన్నిటిలో జీవం నింపే శక్తి ఉంటుంది

*9 మార్చి 2011*

# కవిత్వం, ధ్యానం

కవిత్వమూ, ధ్యానమూ పసిపిల్లల్లాంటివి
అవి మనం రమ్మంటే రావు
మన ముఖం చూస్తాయి
మనం నచ్చితే వస్తాయి, నచ్చినంత సేపే ఉంటాయి

హృదయాన్ని ఆవరించిన ఉద్వేగాలని శాంతితో శుభ్రం చేసుకొని
ముఖంలో నవ్వు వెలిగించుకొని
కళ్ళు విశాలంగా తెరిచినట్లు మూసుకొని
మన మంచితనాన్ని మనమైనా నమ్మి
మన వద్దకి తప్పక వస్తాయని తలచి, వేచి చూడాలి

అప్పుడు అవి వస్తాయి
మనని తాకి మననుండి మనని తొలగిస్తాయి
మనల్ని కాసేపు పసిపిల్లల్ని చేస్తాయి

కవిత్వమూ, ధ్యానమూ, పసితనమూ ఒకలాంటివి
అవి మనలోపలి మంచితనంలాంటివి

*4 మార్చి 2011*

# మొదలైతే చాలు

ఆకాశంలో పలుచగా పరుచుకొన్న శబ్దంలా
పదార్థంలో కోమలంగా నిద్రిస్తున్న రుచిలా
ఇంకా ఏ అనుభవమూ ఎదురుకాని మెలకువలా
సరళంగా, తేటగా, ప్రశాంతంగా సిద్ధంగా ఉండగలిగితే చాలు

పిట్టవాలాక పిట్టలో వాలుతున్న విశ్రాంతిలా
నవ్వుతుంటే నవ్వులో వికసిస్తున్న కాంతిలా
ఊరికే ఉండీ లేనట్లు, కదిలీ కదలనట్లు
ఉండగలిగితే చాలు, చలించగలిగితే చాలు

అలవోకగా రెక్కలల్లార్చి ఎగరబోయే పిట్టలా
అలలా నీటిలోకి జారి చేపలా ఈదుతున్న మనిషిలా
మొదలయీ కానట్లు మొదలైతే చాలు

తెలియని శక్తులు ఏవో వాటంతట అవి
మన ఊహల్లో వాలి, మాటల్లో ఒదిగి, పనుల్లోకి ప్రవహించి
మన కవిత్వాలనీ, కర్తవ్యాలనీ వెలిగించి, దీవించి వెళతాయి

*30 జనవరి 2011*

# రాయటం మొదలుపెట్టాక

ఎవరో చేయిపట్టుకొని రాయిస్తున్నట్లుంటుంది
నదిలోకి దిగటం వరకే మన చేతుల్లో ఉన్నట్లు
నిద్రలోకి ప్రవేశించటం వరకే మనకు తెలిసినట్లు
మొదటి ఊహని అక్షరాలుగా అనువదించటం వరకే తెలుస్తుంది

వీధిలో అడుగుపెట్టాక దార్లు నడకని నిర్ధారించినట్లు
లోపలి మాటని విడిచిపెట్టాక లోకంలో దానిపని అది చేసినట్లు
విశ్రమించిన భావనాశక్తుల్ని మేలుకొలిపాక
ఏదో మహావిహంగం రెక్కలపై ఎక్కినట్లుంటుంది

కవిత్వం రాయటం మొదలుపెట్టాక
ఇక ఎగరవలసిందే, ఈదవలసిందే
సవాలక్ష ఊహలు సరదాగా మనల్ని ఆడుకోవలసిందే
మన లోపలి జీవితేచ్ఛనో, సౌందర్యాన్నో
కవిత్వం అద్దంలో చూసుకోవలసిందే, సరిచూసుకోవలసిందే

*23 జనవరి 2011*

# చివరిమాటలా

ఏ మాట చెప్పినా ఇది చివరి మాటన్నట్టు చెప్పాలి
కాలం చాలా ఉన్నట్లు కాక, కాలం చాలదన్నట్టు చెప్పాలి

సరైన భావాలు చూసుకొని, పదాలు ఏరుకొని
సరైన భావావేశం తలదాల్చి
సరళంగానే అయినా సంపూర్ణంగా
సూటిగానే అయినా సున్నితంగా
వేగంగానే అయినా వెన్నెలకిరణంలాగా చెప్పాలి

ఎంతకాలం బ్రతికినా ఇదే చివరి క్షణమన్నట్టు బ్రతకాలి
సమయం చాలా ఉన్నట్లు కాక, సమయం చాలదన్నట్టు బ్రతకాలి

సరైన జ్ఞానం నేర్చుకొని, సరైన సందర్భం పట్టుకొని
సరైన సంజ్ఞలు ఎన్నుకొని, సరికానివన్నీ మానుకొని, వదులుకొని
స్వచ్ఛంగా స్ఫటికంలా, సహజంగా పచ్చదనంలా, చురుకుగా మెరుపులా బ్రతకాలి

మళ్ళీ బ్రతికే వీలుందో, లేదోనన్నట్లు బ్రతకాలి
వెళ్ళిపోయినా ఉండిపోవాలన్నట్లు బ్రతకాలి

*24 ఫిబ్రవరి 2011*

# రాసినవే రాస్తున్నానా

రాసినవే మళ్ళీ రాస్తున్నానా అని సందేహం వస్తోంది
చూసిన సూర్యుడినే మళ్ళీ చూడటం లేదా
బ్రతికిన జీవితమే మళ్ళీ బ్రతకటం లేదా అని చెప్పుకొన్నా
జవాబులో ఎక్కడో లయ తప్పినట్లనిపిస్తుంది

వచ్చిన వస్తువులే మళ్ళీ వస్తున్నాయా అనుకొన్నపుడు
ఒక్క పర్వతాన్నే పదిసార్లు వర్ణించినా
ప్రతిసారీ మరొకవైపునుండి చూస్తున్నాను కదా
ప్రతిసారీ కొత్తగా మేలుకొంటున్నాను కదా అనుకొంటే
జవాబు కొంచెం బావున్నట్లనిపించింది

ఎవరో అన్నట్లు ఒక కవి ఒక్క కవితే రాస్తాడేమో
ఒక గాయకుడు ఒక్క పాటే పాడతాడేమో
వైవిధ్యం ఉండాలి కదా అని
పది రకాల చీకట్లని తలుచుకోవటం కన్నా
ఉన్న ఒకే వెలుతురుని పదిసార్లు తలుచుకోవటం మంచిదని

ఒక్క హృదయంతోనే మళ్ళీ కవిత్వం రాస్తున్నాను
ఒక్క హృదయాన్నే మళ్ళీ కవిత్వంలోకి ఆహ్వానిస్తున్నాను

*4 మార్చి 2011*

# పంజరాలు

'కొన్ని సమయాలు' పత్రికలో చదివి
ఎవరో మాట్లాడుతూ ఏ సందర్భం ఉద్దేశించారన్నారు

ఏ ఉద్యమంమీద అక్షరాలనీళ్ళు చల్లుతున్నారని వారి ఉద్దేశ్యం
అది ఏ ఉద్యమం గురించీ కాదు
మన అందరి జీవితోద్యమం గురించని కవి చెప్పాడు
బాగానే ఉంది కాని, సమాజస్పృహ కావాలి కదా అన్నారు

ఆకాశంలో ఎగిరే పక్షిని
పంజరంలోని పక్షి ఊచల చాటునుండి చూస్తూ
పాపం అది ఆకాశంలో బంధించబడింది
ఏంచేయాలో తెలియక ఎగురుతోందనుకొంటుంది
పక్షీ ఆకాశంలో ఎందుకు ఎగురుతావు
పంజరం చేరుకొని ఊచల్ని తిట్టవచ్చు కదా అంటుంది

జీవితం కాన్వాసుమీద సమాజం ఒక బొమ్మ మాత్రమే
జీవితం లేకుండా సమాజం లేదు
జీవించే ఏర్పాట్లు మాత్రమే జీవితం కాదు
జీవితం అర్థమైతే సమాజం అర్థమౌతుంది, అర్థవంతమౌతుందని
కవి ఎప్పటిలాగే తనకు తానే జవాబు చెప్పుకొన్నాడు

ఇది ఆకాశం, ఇది స్వేచ్ఛ, ఇది జీవిత లక్ష్యమని స్పష్టంగా తెలుసుకొని
జీవితం దారి తప్పిన మూలాలు వెదికి పట్టుకొని

మన బహిరంతర పోరాటాలూ, త్యాగాలూ చేయాలని
పోరాటం ఏదైనా దు:ఖంతోనే, జీవనక్షేత్రంలోనే అంటే
పరనింద మినహా జీవితమంటే ఏ ఆసక్తీ లేనివారికి అర్ధంకాదు

చాలామందికి నచ్చిన మాటలు చాలు, చిత్తశుద్ధి అక్కరలేదు
విలువలు మాట్లాడితే చాలు, వాటికి దూరంగా బ్రతికినా ఫరవాలేదు

ఎవరి కనురెప్పలు ఎవరు విప్పగలరు
పంజరాలు నిండిన ఆకాశంలో
మిగిలిన ఆకాశంకూడా పంజరంలాగానే కనబడుతుంది

*23 మార్చి 2011*

# తెరుచుకొని ఉండటం

తలుపు తట్టినపుడు ఎవరు అని వినిపిస్తుంది
నేను శబ్దం గదిలో ప్రవేశించాక
మన నేనో, కాని నేనో పోల్చుకొని తలుపులు తెరుచుకొంటాయి

పదాలు చూసీ, పదాల వాసన చూసీ
మన తలుపులు తెరుచుకొంటాయి లేదా బిగుసుకొంటాయి

పసిపిల్లల కనులలాగా,
ప్రశాంతంగా వికసించే పూలలాగా
మనకన్నివేళలా తెరుచుకొని ఉండటం చాతనైతే బాగుండును

*30 జనవరి 2011*

# ముడి విప్పటం

తాడుముడి విప్పమన్నారు
తాడు అటూ, ఇటూ తిప్పి చూసి
ముడి ఎటునుండి పడిందో
అటునుండి వెనక్కులాగితే ముడి విడిపోయింది

తాడుముడి విప్పినట్టు మనుషుల్ని విప్పిచెప్పటం తేలిక
సంపన్నులు చెడ్డవారు, పేదలు మంచివారు
సంపన్నులు పుణ్యాత్ములు, పేదలు పాపంచేసారు
ఎవరికి నచ్చినట్టు వారు ముడివిప్పవచ్చు

మనిషిలో వేల ముడులున్నాయి
తాడులాంటివి, దారంలాంటివి, మరీ సన్నటివి
మనలోపలి కేంద్రాలు సాలెగూడు దారాల్లా చిక్కులు పడివున్నాయి
సన్ననిపోగుల ముడులు విప్పటం కష్టం

ముడి విప్పబోయి మరోముడి వేసేవారి మధ్య
విప్పలేక దారాలు తెంపి ప్రోగులుపెట్టేవారి మధ్య

ఇతను చాతనైనంత ఓపికగా
వీలైనన్ని ముడులు విప్పే పని పెట్టుకొన్నాడు
ముడులు ఎటునుండి పడ్డాయో తెలుసుకొంటూ
అటునుండి విప్పుకొంటూ వెళుతున్నాడు

*10 ఫిబ్రవరి 2011*

# మౌన వాక్యం

సత్యమూ, సౌందర్యమూ, సంవేదనా కలగలిసిన
ఒక వాక్యం కోసం కవి కలగంటాడు

ఆలోచనల దారుల వెంట నడిచి అనేక సత్యాలను పలకరిస్తాడు
ఆశ్చర్యం గొలిపే ప్రకృతిలో మునిగి అనేక సౌందర్యాలను హత్తుకొంటాడు
చీకట్ల వెలుతురుల మనస్సులో చేరి అనేక స్పందనలను అనుభవిస్తాడు

ప్రతిదీ తనలో మిగతా రెండూ ఉన్నాయంటుంది
ప్రతిదీ తనలోంచే మిగతావి తెలుస్తాయంటుంది

బొమ్మలగదిలో వదిలిన పిల్లవాడిలా
కవి ప్రతి వాక్యాన్నీ పట్టుకొని చూస్తాడు

పట్టుకోకముందు మెరిసిపోతున్న వాక్యాలు
పట్టుకోగానే వెలిసిపోవటం గమనిస్తాడు
తన పాదాల అలికిడి కాగానే తెలియరాని రహస్యాలేవో
పావురాల గుంపులా ఎగిరిపోవటం గమనిస్తాడు

అప్పుడిక కవి మాట్లాడటం మానేస్తాడు
వాక్యాల కోసం వెదకటం మానేస్తాడు

అప్పుడతని చుట్టూ
సత్యమూ, సౌందర్యమూ, సంవేదనా కలగలిసిన మౌనం ఏదో
వెలుతురులా, ఆకాశంలా, మెలకువలా పరివ్యాప్తమౌతుంది
ఒక మౌనవాక్యమేదో కవిలోపల మంత్రంలా సంచరిస్తుంది

*24 ఫిబ్రవరి 2011*

# శ్రీ రమణమహర్షి

మరణానికి అటువైపున జీవించినవారు
మౌనమనే మహానదిలా ప్రవహించినవారు

పసితనంలో నిలబడి చూపించినవారు
ప్రశ్నలాంటి జవాబుని కనుగొన్నవారు

ఏమీకాని నేను ను బోధించినవారు
ఎక్కడాలేని విశ్వాన్ని తొలగించినవారు

నీవే దైవమని ధైర్యం చెప్పినవారు
ఊరికే ఉంటే చాలని ఓదార్చినవారు

ప్రాణి ఎవరైనా ప్రాణంపై దయచూపినవారు
వస్తువు ఏమైనా పవిత్రతను దర్శించినవారు

మన కంటికి మనకంటే సామాన్యులు
మన హృదయానికి మనకన్నా సుపరిచితులు

వారు మన కల వెలుపల కోయిల కలస్వనం
వారు నిజమైన నవ్వు, నీ లోపలి నిజమైన నువ్వు

*3 మార్చి 2011*

# చలంగారికి నివాళి

మీరు చూడటం చూసి, ఇతను చూడటం నేర్చుకొన్నాడు
మీనుండి హృదయంనుండి మాట్లాడటం నేర్చుకొన్నాడు

ఇతను శ్రీశ్రీని చదవబోయి మిమ్మల్ని చదివాడు, ఇద్దరు శ్రీశ్రీల్ని చూసాడు
మీ మ్యూజింగ్సులో కరిగిపోయాడు, మీ చేయి పట్టుకొని టాగోర్‌ని కలిసాడు
మిమ్మల్ని అనుసరించి అరుణాచలంవరకూ నడిచాడు
అక్కడ మిమ్మల్ని విడిచి మీరు నడవదలచిన దారివెంట అడుగులు వేశాడు
యవ్వనదినాల మీ సావాసం ఇతన్ని తప్పుదోవలాంటి సరైనదోవ నడిపించింది

చలంగారూ, చాలావాటికి క్షమించాలి చాలామందిని
మీరు పువ్వుల్నీ, పిట్టల్నీ చూపిస్తున్నపుడు
మీ చూపుడువేలుని పరిశీలించే రసదృష్టికి క్షమించాలి
మీతో నడిచేవారున్నారని సంబరపడుతున్నపుడు
మీతో నడుస్తూనే ఎవరిదోవన వారు నడిచిన నైపుణ్యానికి క్షమించాలి
మీరు హృదయమంతా నింపి మాటలు బహూకరిస్తున్నపుడు
మీ మాటల్లో వారి మాటలే విన్న తెలివితేటలకి క్షమించాలి

చలంగారూ, మీరు మానవజాతి స్వేచ్ఛా స్వప్నం
మీరొక కలని నాటారు, రాబోయే తరాలకు మీరొక మహావృక్షాన్ని కానుకగా ఇచ్చారు
మీరు జ్ఞాపకమున్నంత కాలం మానవులు ఎదుగుతారు
మానవులు ఎదుగుతున్నంత కాలం మీరు జీవించి ఉంటారు

*27 ఫిబ్రవరి 2011*

# సంజీవదేవ్‌గారికి

మిమ్మల్ని చూసేవరకూ
రసానందానికి చింతన వ్యతిరేకమని, వాటికి ఎప్పటికీ పొసగదని భావించేవాడిని

మిమ్మల్ని చూసాక పూవుకి హానిలేకుండా మకరందం స్వీకరించాలంటే
సున్నితమైన స్పందనా, నిశిత పరిశీలనా సమానంగా అవసరమని
రసచింతనల మేలుకలయికలో
నిగూఢలోకాల సంచరించే మహత్వముందనీ గ్రహించాను
రససంయమనం మీనుండి నేర్చుకొన్నాను

దయ, వివేకం ఏది అవసరమంటే
రెండూ సమానంగా ఉన్నతమైనవని
ఏ ఒకటో ఎన్నుకోమంటే దయ ఉంటే చాలంటారు గౌతముడు

నేను చూసిన మీరు బుద్ధునిలోకంవారు
మీరు రాసినదానికన్నా మీరు ఉన్నతమైనవారు
మీ వర్ణ చిత్రాలవలే మీ నవ్వు రసమయమైనది

కాలంచాలని కాలంలో మీతో ఉంటే కాలం నిదానించేది
ఇరుకు జీవితం విశాలమయ్యేది, ఉద్వేగాలు చల్లబడేవి
మొరటు భావాలు సాధువులై శక్తి పొందేవి

మానవుడు అతిమానవుడు కావాలని
తెనాలినుండి తుమ్మపూడి వెళ్ళాలన్నంత తేలికగా చెప్పి
మహాగమ్యమైనా తేలికగా తెలియచెప్పటం
విచారధార ననుసరించి జీవితం లోతులు దర్శించటం మీరు నేర్పారు

*24 మార్చి 2011*

# శుభ్రమైన కవికి

ఎన్ని ఉదాత్తభావాలు చెప్పినా
ఎన్ని జీవనరహస్యాలు విశదీకరించినా కవి సౌందర్యపక్షం

మిగతావి కవికి అదనపు బాధ్యతలవుతాయి
అవి అతనికంటే జ్ఞానులూ, శాస్త్రవేత్తలూ బాగా చేస్తారు
కవి మినహా ఎవరు సౌందర్యం ఆవిష్కరించగలరు
కవి మినహా ఎవరు రసలోకం భువికి దించగలరు

శుభ్రమైన కవీ, ఇస్మాయిల్‌గారూ మీరు ఈ కవిని మన్నించాలి
ఇతను ఈకాలానికి కవిత్వంకన్నా, తత్వం అత్యవసరమని తలచాడు
మనిషిలోని సౌందర్యాన్ని తట్టిలేపే ప్రయత్నం కొన్నిసార్లు మరిచాడు

ఇతను పూసిన కాసిని పూలనీ
సౌందర్యరహస్యం తెలిసినవారు రహస్యంగా దర్శించటం మినహా
ఎవరూ పట్టించుకోకుండా వాళ్ళ నీడల్ని తరుముకొంటూ వెళ్ళిపోయారు

రాయిలాంటి జీవితాన్ని బంగారం చేసే రసవిద్య తెలిసిన మిత్రులు
ఇరుకుదారుల్లోకో, జీవితంలా ఛిద్రమైన వాక్యాల్లోకో తరలిపోతున్నారు
మరికొందరు ఆర్థికవలయాల్లోకి అనివార్యంగా వలసపోతున్నారు
వినోదమాధ్యమాలూ, కెరీరిజమూ వలవేసి పట్టగా మిగిలిన ప్రాణులు
ఎండుతున్న మడుగులో ఎగశ్వాసతో ఇంకా అక్షరాలు కూడబలుకుతున్నాం

ఎడారిలో తడారిపోయి తిరుగుతున్న సాటివారిని పిలవటానికి
ఈ కవి ఇపుడు నిగూఢసౌందర్యంవంటి అరణ్యం విడిచి మైదానం చేరుకొన్నాడు
ఇతని పిలుపు విని అడవివైపు చూడగలిగే తరువాతి తరంవారు
అద్భుతమైన కవిత్వం రాస్తారని ఆశిస్తున్నాడు, కవి మరి ఆశాజీవి కదా

*7 మార్చి 2011*

# మా కాలం కవి

కవీ, మిమ్మల్ని చూసినప్పుడు
అదృశ్య ఉద్ధృత భావ ఝురుల్ని శిరస్సుపై ఆవాహన చేసుకొని
పృథ్వీతలంపైన ఆవిష్కరించబోతున్న శివునిలా కనిపిస్తారు
మీరు మాట్లాడుతున్నపుడు కనిపించని తరంగాలేవో మీ చుట్టూ పరిభ్రమిస్తాయి
మీ చుట్టూ చేరినవారిని కవిత్వ పరిమళం తెరలుగా క్రమ్ముతుంది

ఒకనాడు వానాకాలపు కొండల్లో నదిలా రక్తవర్ణజలాలతో పరవళ్ళు త్రొక్కిన మీరు
మా కళ్ళముందే నానా గిరుల వాగుల్నీ మీలోకి పొదువుకొంటూ
మైదాన ప్రవేశం చేసి, నదీతీరాల దీర్ఘబాహువుల్ని చాపి మహానదిలా విస్తరించారు

ఇపుడు శరదృతునదిలా నిండుగా, నిర్మలంగా
మా జీవనక్షేత్రాల్లోకి కవిత్వం కాలువలు కట్టిస్తున్నారు
మేము మరిచిపోతున్న ఏదో సౌందర్యస్పృహని
నిదురించే మైదానాల్లోకి చప్పుడులేని కలలాగా ప్రవేశపెడుతున్నారు

కవీ, మీరు జీవితాన్ని కవిత్వం చేయబోయి కవిత్వాన్ని జీవితం చేసారు
ఉద్యమాన్ని కవిత్వం చేయబోయి కవిత్వాన్ని ఉద్యమం చేసారు

ఇప్పుడు కవిత్వమూ, జీవితమూ వేరుకాదు
కవిత్వమూ, సర్వహితకాంక్షా ఉద్యమమూ వేరుకాదు
ఇక మేము బ్రతికితే కవిత్వంలా బ్రతకాలి, బ్రతుకు ఒక ఉద్యమంలా బ్రతకాలి

(కవి కె. శివారెడ్డిగారికి)

*27 ఫిబ్రవరి 2011*

# తెలుగుమాష్టారు

తెలుగుమాష్టారూ,
ఇంటర్లో మీముందు అల్లరిగా, ఆసక్తిగా కూర్చున్నపుడు
మీరు తెలుగునీ, మాష్టారునీ ఒకేసారి నిర్వహించేవారు
తెలుగుమీద ప్రేమా, మాష్టారంటే భయమూ ఒకేసారి కలిగించేవారు

కాలం గడిచాక, విన్న పాఠాలన్నీ దయతలచి ఎగిరిపోయినా
మీ తెలుగుమీది ప్రేమ మాత్రం నాలోపల మిగిలిపోయింది
అది ఊరికే ఉండక నాలో కవిత్వాన్ని వెలిగించింది

కవిత్వం పట్టుకొని మీ ముందుకొచ్చినపుడు
నన్ను చూసి గర్వించి, నా కవిత్వాన్ని ప్రేమించారు
అప్పుడు మన మధ్య భయం ప్రేమగా పరిపక్వమయింది

కవిత్వం మనని ప్రేమ వలయంగా సరిదిద్దింది
ప్రేమ కవిత్వాన్ని మిగిల్చింది

అప్పటినుండీ ప్రేమా, కవిత్వమూ
మన మధ్య వలయాలు తిరుగుతూ ఎగురుతున్నాయి

(మాష్టారు జీయస్వీ నరసింహారావుగారికి)

*2 మార్చి 2011*

# నన్ను కనుగొన్నారు

ఆరాధన సంపుటి రాసి నాదారిన నేనున్నపుడు
ఎవరో నాకోసమే పంపించినట్టు
మీరు మా ఊరొచ్చారు, నన్ను వెదికి పట్టుకొన్నారు

కవిత్వమెందుకు రాయటం, ఎవరు వింటారని తలపోస్తున్నపుడు
శుభ్రమైన అద్దంలాంటి హృదయంతో నన్ను చదవమన్నారు

చదువుతూ చదువుతూ
మీ ముఖంలోని వెలుతురుసాంద్రతలో
మీ వాక్యాలలో, మీ వాక్యాల విరామాలలో
నా కవిత్వం నేను మళ్ళీ చూసుకొన్నాను, సరిచేసుకొన్నాను

నా కవిత్వమెవరికి కావాలని నాలోకి నేను ముకుళించుకొన్నపుడు
నా ముందు భూతద్దంలాంటి అద్దమొకటుంచి
నా విలువ నాకు పెంచి ధైర్యం కలిగించారు

ఎవర్ని వారే మరిచిపోయి బ్రతికేకాలంలో
మీరు చాలాసార్లు నన్ను నాకు పరిచయం చేసారు

నిరుత్సాహంలాంటి బద్దకం ఆవహించినపుడల్లా
మీకు కవిత్వం బాకీ ఉన్నట్టు, నా జేబు మీదైనట్టు
నానుండి నన్ను బయటకు లాగారు

కవిత్వమంటే కలగనటం ఒకటే కాదని
ధైర్యంగా, ఉత్సాహంగా బ్రతకటమని
ఆశలాంటి శ్వాస నిండారా నింపుకొని
పెను సవాళ్ళ అలలకి ఎదురీది చూపించారు

చీకటివేళల నాకు కొంచెం తోడుంటారని
కవిత్వదేవత పంపించినట్టు
కొప్పర్తిగారూ, మీరు మా ఊరొచ్చారు, నన్ను కనుగొన్నారు

(కవి, ఆత్మీయులు కొప్పర్తిగారికి)

*1 మార్చి 2011*

# ఆత్మ సహచరునికి

మన మొదటి ఇరవైలలో మనం కలిసేనాటికి
సమసమాజం సహజంగా రావాలని
వ్యవస్థ నైరూప్య విషయమని, వ్యక్తులు పరిణతి చెందాలని
మనం మారటం మన మొదటి బాధ్యతని తెలుసుకొన్నాం
మనలోపలి అరణ్యాలలో నిరాయుధులై సంచరిస్తున్నాం

మనం కలుసుకోగానే ఒకరి దీపానికొకరు కాంతివలయమయ్యాం
ఒకరి పుష్పాలకొకరు పరిమళమయ్యాం
ఒకరి అద్దంలో మరొకరు ప్రతిఫలించాం, పరిశీలించుకొన్నాం

ఇవాళ్టికి యుద్ధించాలని లోకంపై చీకటి దయగా గుడారాలు వాల్చుతున్నపుడు
మీ ఊరి కాలువగట్టుపై చేరి
ప్రవహించే కాలువనీ, కాలాన్నీ, భావాలనీ మృదువుగా ప్రార్థనలా పలకరించాం
మారిపోతున్న మిత్రులనీ, మనుషుల్లో మారుతున్న ప్రాధాన్యతలనీ పలవరించాం

చీకటిలో తేలుతున్న నక్షత్రాలలా
చిరంతన మానవవిషాదంలో మెరుస్తున్న సత్యాలను బేలగా హత్తుకొన్నాం
ఎన్నో నిగూఢ విషయాలను సుదీర్ఘ మౌనం మధ్య మాట్లాడుకొన్నాం

రెండు దశాబ్దాలలో మనం ఎవ్వరికీ చెప్పకుండా ఎన్నో రహస్యసీమలు తిరిగివచ్చాం
మన ముఖాలలో దయ వెలిసిపోకుండా
వడగాడ్పుల్లో, ఝంఝానిలాల్లో, మంచుమబ్బుల్లో తలవంచుకు పయనించాం
మనవంతు కన్నీటిని ప్రపంచానికి అర్పించాం

ప్రయాణమొక మజిలీ చేరుకొన్నాక
ఇప్పుడన్నీ అమాయకంగా, విశాలంగా కనిపిస్తున్నాయి
ఇప్పుడందరిలో ప్రేమాస్పదమైనదేదో కనిపిస్తుంది
ఇప్పుడు ప్రతిక్షణమూ మొదటిసారి బ్రతుకుతున్నట్లనిపిస్తుంది

ఇక్కడ కాసేపు ఆగాక, మనని ఒకరినొకరికి చూపించిన శక్తి ఏదో
ఎక్కడో ఉండే మన ఒంటరి మిత్రులకోసం
ఇప్పుడు అక్షరాల పావురాలని పంపుతోంది, వారిలో కాస్తంత ఉత్సాహాన్ని నింపుతోంది

(ఆలపాటి రాంబాబుగారికి)

*1 మార్చి 2011*

# తిలక్ ఊరివాడు

కవిత్వమంటే పద్మానదిపై పడవలో తిరగటమని
ప్రశాంత వాక్యమని, మౌనానికి ముందుమాటని
తత్వం మహత్వాన్ని కవిత్వం చెయ్యటమే ఉదాత్తమని
క్రమంగా తెలుసుకొంటూ, కవిత్వం రాసుకొంటూ గడిపినరోజుల్లో

తిలక్‌గారూ, నేను మిమ్మల్ని సరిగా చదవలేదు
మీ వేగం వెనకున్న హృదయావేగం గమనించలేదు

కవి దగ్గరికి చదువరి రాలేనప్పుడు
చదువరి తరంగదూరం గ్రహించి కవి రాయాలని
లేకుంటే అతనికేమీ వినిపించదని, కనిపించదని గ్రహించి
కొంచెం వేగం, కొంచెం మెత్తని వాడీ నేర్చుకొంటూ
సామాన్యునికి మరికొంచెం దగ్గరి మాటలు కూర్చుకొంటూ
ఇవాళ్టి అవసరానికి తగినట్లు మళ్ళీ అక్షరప్రవేశం చేస్తున్నపుడు

ఇలాగే ఎవరో మాట్లాడినట్లుందని
మీరు జ్ఞాపకం వచ్చి, మిమ్మల్ని మళ్ళీ మొదటిసారి చదివి
నేను రాసినవీ, రాయాల్సినవీ కొన్ని
మీరు నాకన్నా అందంగా రాయటం చూసి సంతోషం కలిగింది

మీరు తిలక్ ఊరి కవి అని ఎవరైనా అన్నపుడు
కాబోలని అనుకొనేవాడిని కాని
తిలక్‌గారూ, నేను మీ ఊరివాడినని,
మీ తరువాతి తరంవాడినని ఇప్పుడు తెలుసుకొన్నాను

*1 మార్చి 2011*

# గ్రీష్మంలో జీవితం

పచ్చని ఆకుల్లాంటి పదాలని ఏరి కాగితంపై పేర్చగానే
ఎండిపోయి గాలికి ఎగిరిపోతున్నాయి
కోమలమైన పూవుల్లాంటి భావాలని
మృదుహృదయంతో వెదికితెచ్చి కవిత్వం అల్లగానే
రాలిపోయి ధూళిలో కలిసిపోతున్నాయి

ఇప్పుడే అక్షరాలు పేర్చిన కాగితం అంతలోనే వేసవి మధ్యాహ్నంలా తెల్లబోతుంది
రసజ్ఞుల నేత్రాలలో నేడు నెరలు విచ్చిన నేలలు కనిపిస్తున్నాయి

ఎందుకో ఎవరమూ బాగాలేము
సమయం చాలనట్టుంది కాని సంతోషంగా లేము
హృదయం బరువెక్కింది కాని ఓటికడవలా ఉంది
ఎవరి మాట ఎవరమూ వినటం లేదు
ఎవరి మాట వారికైనా వినిపించటం లేదు

అందరం దేనికో ఎదురు చూస్తున్నట్లుంది
బహుశా ఏ వర్షమో రావాలని అందరూ తలుస్తున్నట్లుంది
రాబోయే రోజులెలాంటివో ఎగసిపడే ధూళిలో ఎవరికీ కనిపించటం లేదు

మన చేతుల్లో ఏమీలేదని అందరికీ తడుతున్నట్లుంది
స్తబ్దతకూడా కాదిది, జీవితం ఆవిరవుతున్న భయావహఘడియలా ఉంది

కవీ, ఏం చేయాలంటారు. కవీ మాట్లాడడు.
లోయ అంచున శిఖరారోహణ జరుగుతోంది
ఎప్పుడేమి జరుగుతుందో వేచి చూడాలి
జీవితం ఒక వసంతాన్ని దాచి ఉంచిందని నమ్మి నడవాలి

*3 మార్చి 2011*

# కవీ, మేఘమూ

శీతాకాలపు సోమరిరోజులలో పైన మేఘమూ, కింద కవీ
గాలిలో ఈదుతున్నట్లు రికామీగా తిరుగుతుంటారు
ఎదురైన పిట్టల్ని మేఘమూ, ఎదురైన మనుషుల్ని కవీ
పలకరించీ, పలకరించకుండా తరలిపోతుంటారు

సముద్రంలోంచి నదుల్ని ఎత్తుకొని
నేలపై పసిపాపలా సుతారంగా జారవిడిచిన మేఘం
తనకేమీ తెలియనట్లు పసిమొహంతో మనని చూస్తుంది

జీవిత మహోద్వేగాలని మృదువుగా పొదువుకొని
మన మనస్సీమలలో ఇంద్రధనస్సుల్ని ఆవిష్కరించిన కవి
తేలికైన హృదయంతో
పిట్టలగుంపుల మధ్య తనని పోగొట్టుకొని, వెదుకుతుంటాడు

వయసు వచ్చిన అమ్మాయి
అద్దంలో అటు తిరిగీ, ఇటు తిరిగీ చూసుకొన్నట్లు
మేఘం తన రూపాన్ని అటూఇటూ మార్చుకొని చూసుకొంటుంది

పిల్లవాడొకడు తెల్లకాగితంమీద
కొత్త గీతల్నీ, మలుపుల్నీ కనిపెడుతున్నట్టు
ప్రశాంతమైన మనస్సులో కవి కొత్త ఊహల్ని కనిపెడుతుంటాడు

పరిచిన కంకర రాళ్ళమీద నడుస్తున్నట్టు
నిమిషాల ముళ్ళమీద నడుస్తూ వుండే మనల్ని
కవీ, మేఘమూ పలకరించీ, పలకరించకుండా తరలిపోతుంటారు
మనని ప్రేమిస్తూ కూడా మనని చూడనట్టే వెళ్ళిపోతుంటారు

స్వేచ్ఛగా వుండమనీ, స్వచ్ఛంగా వుండమనీ
మనకి తెలియకుండానే మనని దీవిస్తూ తిరుగుతుంటారు
ఈ శీతాకాలపు సోమరిరోజులలో కవీ, మేఘమూ.

*4 జనవరి 2011*

# సరళమైన మాటలు

సత్యం మాట్లాడు, మేలైన మృదువైన సత్యం మాట్లాడు
దయ కలిగి ఉండు, వేల సుగుణాల పూలు పూయించే దయ కలిగి ఉండు
నీకు ఇతరులు చేస్తే బాధ కలిగేది ఇతరులకి చెయ్యకు
నీకు ఇతరులు చేస్తే సంతోషమయ్యేది ఇతరులకి చెయ్యి

విన్నమాటలే, చిననాటి పాఠం పుస్తకాలు చెప్పిన మాటలే
లోకంలో వాడుకలో ఉన్నవో, లేవో తెలియని మాటలే
ఎవరైనా చెబుతున్నా వినిపించటం మానేసిన మాటలే

అవి గాలిలా, జ్వాలలా, నీటిలా సరళమైన మాటలు
అవి సహజమైనవి, స్వచ్ఛమైనవి
అవి సనాతనం, నిత్యనూతనం

మానవీయ విలువలు విడిచి బ్రతికినవాడు
ప్రపంచంలో గెలిచినా తనలోపల ఓడిపోతాడు
విలువలకి నిలబడినవాడు ప్రపంచంలో ఓడినా తనలోపల గెలుస్తాడు

వజ్రాలకన్నా పూలు విలువైనవని
పంచమహామాయల ప్రపంచంకన్నా హృదయం నిజమైనదని
కవి చెబుతున్నాడు. ఈ మాట చెప్పేందుకే కవి వస్తాడు

మనలోపల హృదయమనే వెలుతురుంది
జననమరణతీరాల అవతలి వెలుతురు మనలోపల వెలుగుతుంది
ప్రపంచం పరిచే ధూళివంటి మాయని శుభ్రం చేసుకోగలిగినపుడు
ఆకాశంలా ఉండీలేనట్లు శాంతంగా బ్రతకటం చాతనైనపుడు

మనలోపలి వెలుతురు పెరుగుతుంది
విలువలకు నిలబడలేని బలహీనుల వెలుతురులో చీకటి చేరుతుంది

గాలిలా, జ్వాలలా, నీళ్ళలా కొన్నిమాటలు ఎప్పటికీ ఉంటాయి
విన్నా, వినకున్నా, చూసినా, చూడకున్నా
వాటి వెనకాల పసివాడిలా నడిచినా, నడవకున్నా
మనలోపల వెలుగుతూనే ఉంటాయి

మనకే మేలైనా వాటికి మేలన్నంత నిష్కపటంగా పిలుస్తూనే ఉంటాయి
దయగా పిలుస్తూనే ఉంటాయి

*26 ఫిబ్రవరి 2011*

# సరిగా ఉండటం

అన్నీ సరిగా ఉండాలనుకోవటం కల కావచ్చును
అలమరలో పుస్తకాలు పొందికగా నిలబడినట్టు
కాగితంమీద రెండుగీతలు సమానంగా ప్రయాణిస్తున్నట్టు
రైలుపట్టాలు వాటిమధ్య దూరంలాంటి దగ్గరని పొడవునా సరిచూసుకొంటున్నట్టు
అందరూ సమానంగా మనలా ఉండాలనుకోవటం భ్రమ కావచ్చును

చిక్కులు పడిన దారంపోగులలాంటి మాటల్నీ, పనుల్నీ
విడదీసి, సరిచేసి, ఒకచోట చేర్చాలనుకోవటం వృథాప్రయాస కావచ్చును

మనం ఊహించినట్టు సీతాకోకలు ఎగరాలనుకోవటం
మనం ఊహించిన కొమ్మలకి, ఊహించిన పూలు పూయాలనుకోవటం
రేకలిలా వికసించాలనుకోవటం, రంగులిలా ప్రకాశించాలనుకోవటం
పరిమళం ఈ మేర వ్యాపించాలనుకోవటం
మన భ్రమ మాత్రమే కాదు, అన్యాయమూ కావచ్చును

ప్రపంచం మనం సరిచేయటానికి లేదని
జీవితం మనల్ని సరిచేసుకోవటానికి వుందని
మనం చూసే చిక్కులన్నీ, లోపాలన్నీ మనకి ఏవో నేర్పబోతున్నాయని
మన లోపలి ముడులేవో విప్పబోతున్నాయని

మనకు తెలియని లోకాలలోకి, లోకంలోని బహుముఖాల కొలతల్లోకి
మనల్ని వికసించమని, ప్రవహించమని, విహరించమనీ రహస్యంగా చెబుతున్నాయని
ప్రశాంతంగా, అందరిపైనా, మనపైనా దయగా, లాలనగా గ్రహిస్తే బాగుండును

పిల్లలు మన పదాలనీ, ఉచ్చారణనీ, వ్యాకరణాన్నీ
ఏ విశ్లేషణా చేయకుండా ఊరికే తెలుసుకొంటున్నట్టు
జీవితాన్ని ప్రతిక్షణమూ ఊరికే తెలుసుకోవటం చాతనైతే బాగుండును

నిన్నటి ప్రపంచాన్ని నిన్ననే వదిలి ఇవాళ కొత్తగా జీవించే పసిపిల్లల్లా
ప్రతి మెలకువతోనూ కొత్తగా మేలుకోవటం మనకు తెలిస్తే బాగుండును
వాళ్ళలాగే మనకూ
ప్రపంచాన్ని ఎప్పుడూ కొత్తది చేసే మంత్రమేదో తెలిస్తే బాగుండును

*30 జనవరి 2011*

# బ్రతుకుపాట

మన మంచి మనకు తెలియకపోవటం మంచిది
తెలిసిందంటే నడక ఆగిపోతుంది, ప్రచారం మొదలవుతుంది
మన విజయాలు మనం మరిచిపోవటం మంచిది
వాటిని తలచుకొంటే గతంలో బ్రతుకుతాం, స్మృతిచిహ్నంలా మిగులుతాం

లోకంనుండి పొందాల్సిందీ, లోకానికి ఇవ్వాల్సిందీ చాలా ఉందనుకోవాలి
లోపల జీవనదాహం మిగలాలి, లోకంపై దయ తొణికిసలాడాలి

వినవలసినవీ, కనవలసినవీ, తాకవలసినవీ ఇంకా చాలా ఉండాలి
బ్రతుకు ఉత్సాహం దోసిట నింపుకొని చాలా దూరం నడవాలి
రేపటి మలుపులో ఊహించని ఏ లోకాలున్నాయో చూడాలి

జడవాల్సిన పని లేదు, మన జీవితం మనది కాదు
నేలమీద పడుకొన్నవాడికి మేడలో ఉన్నట్లు కలవస్తే
కలగంటే కలిసొచ్చేదీ లేదు, మెలకువొస్తే పోయేదీ లేదు
తేలికగా బ్రతికే తెలివుంటే చాలు, ఏమి జరిగినా దిగులుండదు

విశ్వం విశాలమైనది, కాలం అనంతమైనది
ఎంత అందం బ్రతుకులో, ఎంత దుఃఖం లోకంలో
ఎంత దుఃఖం బ్రతుకులో, ఎంత అందం లోకంలో

ఏమి అనుభవించామో మరిచిపోవటం మంచిది
ఏమి జరగనుందో తెలియకపోవటం మంచిది
ప్రవాహంమీద ఎండుటాకులా ప్రవహించిపోవటం మంచిది

జీవితం తన తపస్సు తాను చేసుకొంటుంది
ప్రపంచం తన వినోదం తాను చూసుకొంటుంది
జరగవలసినవి చూస్తూ ఉండగానే జరుగుతూ వెళ్ళిపోతాయి
జీవితం చివరిబిందువు పలకరించినపుడు చిరునవ్వు నవ్వితే చాలు

*10 మార్చి 2011*

# బహిరంతరాలు

కవీ మేము దుఃఖంలో ఉన్నాం
సమస్యల వలయాలలో దారితప్పి తిరుగుతున్నాం
అపనమ్మకాల కొలిమిలో కాలుతున్నాం, ద్వేషాగ్నులమై రగులుతున్నాం
మా జ్వాలలకి నీ కనులు విప్పు, వాటిని ఆర్పు అని ప్రజలంటారు

కవి దుఃఖంతో, దయతో వారివంక చూస్తాడు
జీవనసారం ఎండిపోతున్న సాటివారిని మృదువుగా పలకరిస్తాడు

జ్వాలలమూలం తెలియనంత వరకూ అవి తాండవం చేస్తూనేవుంటాయి
ఆర్పేకొలదీ పైకి లేస్తూనేవుంటాయి

సమాజం మనిషిలో భాగం మాత్రమే, మనిషి లేకుంటే సమాజమే లేదు
మనం మనుషులుగా మారాలి, సమాజాన్ని దాటి ఎదగాలి
మనిషి వికాసం సమాజ వికాసమని తెలియాలి

మనం మారటానికి మనలోకి చూడాలి, మన మూలం వెదకాలి
మన స్వార్థం త్యాగంగా పరిణతి పొందాలి
స్వార్థం దుఃఖమూలమనీ, త్యాగం ఆనందబీజమనీ తెలియాలి

కవీ నీతులు బోధించకు, మంటలనార్పు ఆర్పు అంటారు

మీ బదులు యుద్ధం చెయ్యటం మిమ్మల్ని బలహీనులు చెయ్యటమే
మీ ముందు నాయకుడై నిలిచి మిమ్మల్ని అనుచరమాత్రులుగా ఉంచటమే

మీ దు:ఖానికి ఓదార్పునిస్తాను, మీతో కన్నీరు విడుస్తాను
మీరు శక్తిహీనులైనపుడు తగిన విశ్రాంతినిస్తాను,
మీరు కోల్పోయిన శాంతిని మరలా పరిచయం చేస్తాను
మీకు మీపై నమ్మకం కలిగిస్తాను, జీవితంపైన ప్రేమ పుట్టిస్తాను
నా శక్తినంతా ఉపయోగించి మీ జీవనశక్తుల్ని మేలుకొల్పుతాను

క్షమించండి, మీ యుద్ధం నేను చేయరానిది
మీ యుద్ధం నేను చేసి మిమ్మల్ని శాశ్వత పరాజితుల్ని చేయలేను

నా బాధ్యత స్పష్టంగా తెలిసినవాడిని
మిమ్మల్ని ప్రేమించేవాడిని, మన జీవితాన్ని నిజంగా గౌరవించేవాడిని
ఇవి నా మాటలు వినండి అని కవి అంటాడు

ఒకరిద్దరు మినహా ఎవరూ కవిని వినరు
కాలంకాని కాలంలో కవి బాధ్యతగా తన పాట తను పాడతాడు
ఎదుట ఎవరూ లేని వేదికపై
ఒంటరిగా, నిష్కపటంగా తన ప్రదర్శన ముగించి వెళ్ళిపోతాడు

*5 ఏప్రిల్ 2011*

# బయోడేటా

| | | | |
|---|---|---|---|
| పూర్తిపేరు | : బొల్లిన వీర వెంకట ప్రసాద్ | | |
| పుట్టినతేదీ | : **21. 11. 1966** | | |
| పితామహులు | : బొల్లిన వీరన్న, సత్యనారాయణమ్మ-ముక్కామల, ప.గో.జిల్లా | | |
| మాతామహులు | : భోగవల్లి సుబ్బారావు, సూర్యకాంతం-సూర్యారావుపాలెం, ప.గో.జిల్లా | | |
| తల్లిదండ్రులు | : విజయలక్ష్మి, అచ్యుతం | | |
| తోబుట్టువులు | : నాగేంద్రకుమార్, శ్రీ భవాని | | |
| భార్యాపిల్లలు | : మాలతీదేవి, గాయత్రి, భార్గవి | | |
| రచనలు | : ఆరాధన | (వచన కవిత్వం) | **1989** |
| | దృశ్యాదృశ్యం | (హైకూలు) | **1995** |
| | హైకూ | (హైకూలు) | **1997** |
| | పూలురాలాయి | (హైకూలు) | **1999** |
| | నేనే ఈ క్షణం | (వచన కవిత్వం) | **2006** |
| | ఆకాశం | (వచన కవిత్వం) | **2011** |
| | నీలో కొన్నిసార్లు | (వచన కవిత్వం) | **2015** |
| పురస్కారాలు | : ఆంధ్ర సారస్వత సమితి అవార్డు, మచిలీపట్నం | | **2004** |
| | స్నేహనిధి పురస్కారం; విశ్వకళాపీఠం, హైదరాబాద్ | | **2012** |
| | ఇస్మాయిల్ కవితా పురస్కారం, కాకినాడ | | **2011** |
| | గుంటూరుజిల్లా రచయితలసంఘం అవార్డు, గుంటూరు | | **2011** |
| | నూతలపాటి కవితా సత్కారం, తిరుపతి | | **2011** |
| | కె.వి.ఎస్. ఉగాది సాహిత్య పురస్కారం, ఏలూరు | | **2015** |
| | తిలక్ అవార్డు, తణుకు | | **2016** |
| చిరునామా | : బివివి ప్రసాద్, # **23-12-21**, సజ్జాపురం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ **534 211** | | |
| ఫోన్ | : **90320 75415** | | |
| ఈ మెయిల్ | : prasadbvv1@gmail.com | | |
| బ్లాగ్ | : bvvprasad.blogspot.in | | |

aakaasam collection of poems by bvv prasad



కళ్ళలో దయా, స్పర్శలో నిర్మలత్వం
మాటలో నిజాయితీ, మనిషిలా స్పందించటం మరిచిపోకుండా ఉంటే చాలు
హాయిగా నవ్వటమూ, హాయిగా ఏడవటమూ పోగొట్టుకోకుండా ఉంటే చాలు

దృశ్యమేదైనా చూడటమే ఆనందంగా
శబ్దమేదైనా వినటమే ఆనందంగా
రుచి ఏదైనా ఆస్వాదించటమే ఆనందంగా
జీవితమెలావున్నా జీవించటమే ఆనందంగా ఉండగలిగితే చాలు